# కార్తీక పురాణము



సంకలనం : లక్ష్మీగణపతి శాస్త్రి

వెల : రూ. 30/-

# విషయసూచిక

## శ్రీ శివపంచాక్షర స్తోత్రమ్

నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ ।
నిత్యా శుద్ధాయ దిగంబరాయ
తస్మై **'న'**కారాయ నమశ్శివాయ 1

మందాకినీ సలిలచందనచర్చితాయ
నందీశ్వర ప్రమథనాథమహేశ్వరాయ ।
మందార ముఖ్యబహుపుష్పసుపూజితాయ
తస్మై **'మ'**కారాయ నమశ్శివాయ 2

శివాయ గౌరీవదనారవింద
సూర్యాయ దక్షాధ్వరనాశనాయ ।
శ్రీనీలకంఠాయ వృషధ్వజాయ
తస్మై **'శి'**కారాయ నమశ్శివాయ 3

వసిష్ఠకుంభోద్భవగౌతమాది
మునీంద్రదేవార్చితశేఖరాయ ।
చంద్రార్కవైశ్వానరలోచనాయ
తస్మై **'వ'**కారాయ నమశ్శివాయ 4

యక్షస్వరూపాయ జటాధరాయ
పినాకహస్తాయ సనాతనాయ ।
దివ్యాయ దేవాయ దిగంబరాయ
తస్మై **'య'**కారాయ నమశ్శివాయ 5

**పంచాక్షరమిదం పుణ్యం యః పఠేత్ శివసన్నిధౌ ।**
**శివలోకమవాప్నోతి శివేన సహ మోదతే ॥**

**ఇతి శ్రీశివ పంచాక్షరస్తోత్రమ్ సంపూర్ణమ్**

# ఉపక్రమణిక

పరమపవిత్రమైన మన భారతదేశం ఎందరో దేవుళ్ళకు ఋషులకు మునులకు ఆలవాలంగా వున్నది. సృష్ట్యాదినుండి ప్రపంచములోని అన్ని దేశములకంటెనూ శ్రేష్టమైనదిగ పరిగణింపబడుచున్నది. అట్టి పవిత్రమైన భారతదేశమునందు పూర్వం ఆర్యావర్తము అను పుణ్యభూమి కలదు. అచ్చటగల నైమిశారణ్యము మహర్షులకు ఆవాసమగుటవలన ముక్తిప్రదాయిని అను పేరు పొందినది. ఆ నైమిశారణ్యమునందే గొప్పపౌరాణికుడని పేరుగాంచిన సూతమహర్షి తన శిష్యులగు శౌనకాది మహామునులకు, వ్యాసులవారు రచించిన పురాణములన్నిటిని చెప్పుచుండెను. ఒకానొక కాలమందు శౌనకాది మహామునులు సూతునివద్దకు వెళ్లి ఓ మహానుభావా! వ్యాసులవారి ఆనతి ననుసరించి, సకల పురాణములను, క్షేత్ర మహాత్మ్యములను అనేక విషయములు చెప్పి మాకు ఆనందము కలిగించావు. ఇప్పుడు కార్తీకమాసము వచ్చినది. ఈ కార్తీక మహాత్మ్యమును మాకు తెల్పి మమ్ములను పునీతులు చేయుడు" అని పలువిధంబుల ప్రార్థించి మరల యిట్లనిరి: "ఓ మహామునీ ! ఈ వ్రతములలోకెల్ల ఉత్తమమయినది కార్తీక వ్రతమని అంటారు గదా! దానినిగూడా తెలియపరచవలసిన" దని ప్రార్థించగా అపుడు సూతుడు వారినిచూచి కార్తీకమాసము అన్ని మాసములలోనూ శ్రేష్ఠమయినది. కావున ఆ వ్రత వృత్తాంతమును మీకు ఆమూలాగ్రముగా వినిపించెను అని ఈవిధంగా చెప్పటం ప్రారంభించాడు.

సూతుడు తనకు అభిముఖముగా కూర్చునియున్న శౌనకాది మహామునులను చూచి యిట్లనియె : "ఓ శౌనకాది మహామునులారా! మీరు కోరిన యీ కార్తీకమాస మహాత్మ్యము స్కాందపురాణమునందున్నది. ఈ కార్తీక వ్రతమునుగూర్చి పూర్వము బ్రహ్మ నారదునకునూ, శివుడు పార్వతీదేవికిని, శ్రీ మహావిష్ణువు లక్ష్మీదేవికిని చెప్పివున్నారు. అట్టి ఆ వ్రతవిధానమును మీకు చెప్పెదను సావధానముగా వినండి" అని కార్తీకమాసమహాత్మ్యము చెప్పుటకు ఆరంభించెను. శివుడు ఈ వ్రతమును పార్వతీదేవికి చెప్పుచు అన్ని వర్ణములవారునూ యీ వ్రతమును ఆచరించ వచ్చుననియు, యీ వ్రతవిధానమున తరతమ భేదములు లేవనియూ, ముఖ్యముగా కార్తీకమాసము హరిహరులకు ప్రీతియగు మాసమనియు చెప్పెను.

ఈ వ్రతవిధానమును బ్రహ్మవలన నారదమహాముని విని దానిని వశిష్ఠ మహామునికి తెలపగా, వశిష్ఠుడు తరువాత కాలమందు జనకమహారాజుకు చెప్పారు. ఈ విధముగా యీ వ్రతవిధానము భూలోకమునకు వచ్చెను.

# కార్తీకమాస మహిమ

కార్తీకమాస కథా వృత్తాంతమును మహా పౌరాణికుడగు సూతుడు శౌనకాది మహామునులకు యిట్లు చెప్పెను. ఒకానొక సమయమునందు వశిష్ఠమహాఋషి గొప్ప యాగమును తలపెట్టెను. ఆ యాగము నెరవేర్చుటకొరకు మిథిలానగరమును పాలించుచున్న జనకమహారాజు వద్దకు వచ్చెను. జనకమహారాజు వశిష్ఠుని రాకవిని చాలా సంతోషించెను. ఎదురుగా వెళ్ళి, సకలోపచారంబులు చేసి ఉచితాసనమున కూర్చుండబెట్టి కుశలప్రశ్నలు వేసి అనంతరము “ఓ మహర్షీ మీరు పూజ్యులు. మీ రాకవలన నేనునూ, నా దేశము, నా ప్రజలు ధన్యులమైతిమి. నా యశస్సు యినుమడించినది. మీ రాకనందలి ఆంతర్యమును తెలియజేసి, ఆ కార్యమును మాకు తెలియచేయుడు. ఆ కార్యమును మావలన చేయించుకొని మమ్ములను కృతార్థులచేయుడు” అని ప్రార్థించెను. ఆ మాటలు వశిష్ఠుని ఆనందపరచినవి. సంతోషమున పులకించిన హృదయముతో “ఓ రాజా! నీవు ఉత్తముడవు. అందువలననే నీ యొద్దకు రావలసివచ్చినది. నేనొక మహాయాగమును తలపెట్టితిని. యోగులము మాయొద్ద ధనము యుండదుకదా! ఆ యాగమునకు వలయు ధనముకొరకు నీయొద్దకు వచ్చితిని” అని చెప్పెను. అది విని జనకమహారాజు “మహర్షీ! ఒక మహాయాగమునకు ధనమునిచ్చు అదృష్టమువలన మేము ధన్యులమైతిమి, స్వీకరించి మమ్ము కృతార్థుల చేయుడు” అని ప్రార్థించెను. అందులకు వశిష్ఠుడు “ ఓ రాజా! నీ హృదయమునకునూ, భక్తికిని ఆనందించితిని నీకు కావలసినదాని నేదయినా యొకదానిని కోరుకొమ్మనగా జనకుడు వశిష్ఠునికి మరియొకసారి నమస్కరించి ఆయనతో : ఓ మహానుభావా! కార్తీకమాసము అన్ని మాసములకంటెను ఉత్తమమయినదనియూ, గొప్ప మహాత్మ్యము కలదనియూ చెప్పుదురుగదా! ఆ వృత్తాంతమును తెలియకోరికగా యున్నది ఆ మహాత్మ్యమును నాకు తెలియపరచండి” అని ప్రార్థించెను. అది విని వశిష్ఠుడు “ఓ మహారాజా! పూర్వపుణ్యమున ఈ విధముగా ప్రశ్నించితివి.

కార్తీకమాసమున చేయు స్నాన, దాన, దీపాదులకు గొప్ప మహాత్మ్యము గలదు. దాని వినుటవలన సకలపాపములు హరించును. శ్రద్ధాభక్తులతో ఆలకింపుము. "ఓ రాజా! కార్తీకమాసము హరిహర స్వరూపము. అందువలన ఆ మాసమునందు ఆ వ్రతమాచరించి మానవులు సర్వసుఖములనూ పొందవచ్చును విష్ణుపురాణమునందు:

**శ్లో॥ మద్భక్తోశంకర ద్వేషీ మద్వేషీ శంకరప్రియ**
**తావుభౌ నరకం యాంతి యావశ్చంద్ర దివాకరౌ ॥**

శివకేశవ భేదములేక, సృష్టిస్థితి లయకారుల త్రిమూర్తి స్వరూపమును, అన్నిమతములు, జాతులు, కులములవారునూ పూజించి ముక్తిని పొందవచ్చును.

## 1. కార్తీకమాస స్నానము - వ్రతము

వశిష్ఠుడు జనకమహారాజునకు యిట్లు చెప్పెను : "ఓ మహారాజా! కార్తీకమాసమునందు ప్రతిఒక్కరూ ఉదయముననే లేచి, తులారాశియందు సూర్యుడు యుండగా స్నానము, దానము, జపము, దేవీపూజ మొదలగున్నవి చేసిన సకల శుభాలు కలుగును.

సూర్యభగవానుడు తులారాశియందు ప్రవేశించిన దినమునుండిగాని, కార్తీకశుద్ధ పాడ్యమి మొదలుకొని ఈ వ్రతమును చేయవలయును. ప్రారంభించుటకు ముందు కార్తీకమాసమునకు అధిపతియైన శ్రీ మహావిష్ణువును స్మరించుకొనవలయును.

ఈ మాసమంతయు ఒక జీవనదియందు స్నానము చేయవలయును, అట్లు వీలులేని పక్షమున ఆరంభమునందయిననూ స్నానము చేయవలయును.

గోష్పాదమంత తటాకమునందు కూడా ఆదినారాయణుడు యుండునని వేదములు చెప్పుచున్నవి. ముఖ్యముగా గంగానది, నదులన్నిటియందునూ ఈ కార్తీకమాసమునందు అంతర్వాహినియై ప్రవహించును. కావున అట్టి జీవనదియందు, మెడలోతు నీటియందు నిలుచుండి శ్రీమహావిష్ణువునకునూ, భైవరస్వామికిని వందనములు ఆచరించి సూర్యునకునూ, నదికిని అర్ఘ్యంబులు ఈయవలయును. తదుపరి దేవతలకును పితృదేవతలకును తర్పణములు ఈయవలయును. పిమ్మట నదీతీరమునకువచ్చి, గట్టున మూడు దోసిళ్ళ నీళ్ళు పోయవలయును. నది, కాలువ, చెరువు లభించనపుడు బావివద్దనయిననూ స్నానమాచరించవలయును.

ఇందు కుల, మత, జాతి వివక్షతలేదు స్నానానంతరము ఆరవేసిన దుస్తులు ధరించవలయును. దైవపూజకు పుష్పములను స్వయముగా కోయవలయును. తదనందరము యధావిధముగా అధితి పూజ చేయవలయును ! వారు భుజించిన తరువాత రెండుసార్లు ఆచమనము చేసి, పరిశుద్ధుడవవలయును.

అనంతరము స్వయముగాగాని యితరులవలనగాని, అశ్వత్థవృక్ష (రావి) మూలమునగాని, మరెచ్చటగాని కూర్చుండి పురాణశ్రవణముచేసి, కార్తీక మహాత్మ్యమును వినవలయును, సాయంత్రము శివాలయమందుగాని, విష్ణ్వాలయమందుగాని, తులసిచెట్టు వద్దగాని దీపారాధన చేయవలెను. తరువాత యిష్టదైవమును పూజించి, పిండివంటలను, భోజనమును నైవేద్యమిచ్చి, స్తోత్రము చేయవలెను. ఈ విధముగా కార్తీకమాసమంతయు చేయవలెను. కార్తీకశుద్ధపాడ్యమి మొదలు, అమావాస్యవరకూ పై విధంగా చేసి ముగించవలయును, యిదియే కార్తీక వ్రతము. మరునాడు శక్తిననుసరించి సమారాధన చేయవలయును. శక్తిలేనివారు పూజను చూచుటవలననే వ్రతఫలితము పొందగలరు. ఈ వ్రతము ఆచరించినవారికి ఈ జన్మయందలి, పూర్వజన్మయందలి సర్వపాపములు నశించును.

## ౨. కార్తీకసోమవార వ్రత ప్రభావము

కార్తీక సోమవార వ్రతప్రభావము ఎంతో గొప్పది అని వశిష్ఠుడు మరల "ఓ జనకరాజా! కార్తీకమాసమున ముఖ్యమగు సోమవార వ్రతవిధానమును గూర్చి చెప్పుచున్నాను. శ్రద్ధగావిను" అని యిట్లు చెప్ప నారంభించెను.

కార్తీకమాసము నందు శివప్రీతికై ఈ సోమవార వ్రతమునాచరింప వలయును. ఆ దినమున స్నానముచేసి యధాశక్తి దానధర్మములను చేయవలయును ఇందు నాలుగు విధములు గలవు.

మొదటిది సోమవారమునాడు ఉపవసించి శివునకు అభిషేకము చేయించుకొని పగలు, రాత్రి భుజింపక రాత్రి జాగరణము చేసి మరుదినము యధాశక్తి సమారాధనము చేయవలయును.

రెండవది అభిషేకము చేయించుకొని సాయంత్రము వరకూ యుపవసించి, నక్షత్రదర్శనము చేసి, భుజింపవలయును, ఇందువలన పాపములు భస్మమగును.

ఈ రెండు విధములగను చేయలేనివారు రెండుజాముల వరకు ఉపవాసం ఉండి బంధుమిత్ర సహితముగా భుజింపవలయును.

ఇని యేవియులేనివారు తృప్తిగా తనకున్నదానినే భుజింపవలయును. యివికూడా లేనివారు నదీస్నానముచేసి భగవంతుని ధ్యానించవలయును.

ఈ సోమవారదినమున సర్వదోషములు నివారింపబడుటకై తిలదానము చేయవలయును. అవకాశముండి చేయలేనివారు, కుంభీపాక నరకంలో బడుదురు. వితంతువులు ఉపవాసముచేసి శివధ్యానముచేసిన శివలోకము పొందుదురు. విష్ణువును ధ్యానించిన వైకుంఠమునకు పోదురు మరియు యీ సోమవారమునాడు బిల్వార్చన చేయించినను, పంచాక్షరి మంత్రమును జపించినను, వారు సర్వసుఖములు, సంపదలు పొందగలరు.

దీనికి అనుబంధముగా ఒక కథగలదు. పూర్వము కాశ్మీర దేశమున దేవశర్మ అనే బ్రహ్మణుడొకడు గలడు. అతడు పౌరోహిత్యవృత్తిచే జీవించుచుండెను. అతనికి సుకేశియను కుమార్తెగలదు. యుక్తవయసు రాగానే ఆమెను మిత్రశర్మయను బ్రాహ్మణునికిచ్చి వివాహము చేసెను. మిత్రశర్మ వేదవేదాంగ పారంగతుడు. సకల శాస్త్రములను చదివినవాడు, వినయశీలి, ఇంతలో సుకేశి యౌవనవతియైనది. ఆమెయౌవ్వనగర్వమున మంచి చెడ్డలను గమనించక వ్యభిచారిణియై తిరుగుచుండెను. భర్తను గౌరవించక, అత్తమామలు తిట్టుచూ, కొట్టుచూ, పెద్దలను దూషించుచూ యిచ్చవచ్చినట్లు తిరుగుచుండెను. ఇవన్నియు తెలిసియు, మిత్రశర్మ భార్యయందుగల అనురాగముచే మాట్లాడక ఆమెచేసే పాపములను సహించుచుండెను.

సుకేశి యింతటితో యూరుకొనలేదు. ఒకనాటి యర్థరాత్రమున గాఢనిద్ర యందు మునిగియుండిరి. సుకేశి లేచి తిరుగలిరాతితో భర్తతల పగలగొట్టి చంపివేసెను. ఆ కళేబరమును యితరులకు తెలియకుండు మోసుకొనిపోయి ఊరిబయట పారవైచెను. ఆనాటినుండియు మరింత గర్వముగ తిరుగుట ఆరంభించినది. పరపురుషులను తన అందముచే ఆకర్షించుచూ, బోధలు చేసి కులపత్నులను కులటలుగ చేయుచు యిల్లాండ్రను పాడుచేయుచూ, పురుషులను రెచ్చగొట్టుచూ, తన యిచ్చ వచ్చినట్లు తిరుగుచుండెను. కాని కాలము యొక్క రీతిగా ఉండదుకదా!

యౌవనము నశించినది, అందము చెడిపోయినది, శరీరమంతయు కుళ్ళిపోయి, రసికారుచూ చూపరులను అసహ్యపడునట్లు చేసినది. తగిన సంరక్షణలేక ఆమె చనిపోయి యమలోకమునకు తీసుకుపోబడినది.

పరాయి పురుషులను కౌగిలించుకున్నందులకు ఆమె కాలిన యినుప స్థంభములను కౌగలించుకొనవలసి వచ్చెను. ఇతర స్త్రీల ధర్మములను చెరచి వారిని చెడగొట్టినందులకు ఎర్రగా కాలిన ముండ్లకర్రలు ఆమె కనులయందు పెట్టబడినవి. పతివ్రతల శీలమును పాడుచేసినందుకామెను మరుగుచున్న తైలమును ముంచిరి. అత్తమామలను పెద్దలను, దూషించినందున ఆమె నోటిలో సీసము పోసిరి. భర్తను రాతితోకొట్టి చంపినందున ఆమె చెవులలో సీసము పోసిరి. భర్తను రాతితోకొట్టి చంపినందుకు ఆమె తలపై యినుపగదులలో గొట్టిరి. ఆమె చేసిన పాపములవల్ల అత్తింటి మూడుతరములవారునూ, పుట్టింట ఏడు తరములవారునూ నరకబాధలు పడుచుండిరి. ఆమె ఈ ప్రకారము అనేక విధములుగా హింసించబడి, క్రిమికీటకాది జన్మ అనంతరము శునక జన్మమునెత్తి, ఆకలికి తాళలేక తిరుగుచు, తిట్లు, దెబ్బలు తినుచూ తిరగసాగినది.

ఒకనాడు మిక్కిలి ఆచారము గలవాడునూ, నిత్యాగ్ని హోత్రియూనగు ఒక బ్రాహ్మణునియింట, కార్తీక సోమవారమునాడు దొంగచాటుగా ప్రవేశించినది. ఆ సమయమున ఆ బ్రాహ్మణుడు బలియన్నమును బైటవేయగా, ఆ అన్నమును ఈ కుక్క తినెను. ఆనాడు కార్తీకసోమవార వ్రతమగుటవలననూ ప్రొద్దుటినుండియూ ఆహారము దొరకక పోవుటవలననూ ఆ బలి అన్నము తినగానే ఆ కుక్కకు జన్మాంతర జ్ఞానము లభించెను. మానభాషతో ఓ విప్రోత్తమా! నా పాపములు బాపి నన్ను రక్షింపమని పలికెను.

అది విని ఆ బ్రాహ్మణుడు ఆ కుక్క మాట్లాడినదని గ్రహించెను. ఆ కుక్కను చూచి నీ వెవరవు అని ప్రశ్నించగా కుక్క అతని పదముల వద్ద వ్రాలి, తన పూర్వజన్మయందు చేసిన జారత్వ మహాపాపమును చెప్పి ఈ బలియన్నము తినుటవలన తనకు పూర్వజ్ఞానము కలిగినదినియూ, కావున కార్తీకసోమవార వ్రతఫలము ధారపోయవలసినదిగా ప్రార్థించెను.

ఆ మాటలు విని బ్రాహ్మణుడు కార్తీకసోమవార వ్రతమున యింత మహాత్మ్యమున్నదని గ్రహించి, దయార్ద్రహృదయుడై ఒక కార్తీక సోమవార వ్రతఫలము ధారపోసెను. వెంటనే ఆ కుక్క మరణించెను. అంతలో పుష్పక విమానము రాగా ఆ కుక్క బ్రహ్మణుని చూచి ఓ మహానుభావా! నీ వ్రతఫలమువలన నాకు ముక్తి లభించినది. అని ప్రార్థించి, సర్వాలంకార భూషితురాలైన స్త్రీ రూపము ధరించి, కైలాసమునకు ఆ విమానమెక్కి వెళ్ళిపోయినది.

కావున ఓ జనకచక్రవర్తీ ! నీవునూ ఈ కార్తీకసోమవార వ్రతమును ఆచరించి శివసాయుజ్యమును పొందుము.

## 3. కార్తీక వ్రత మహిమ

వశిష్ఠమహర్షి జనకమహారాజునతో ఈ విధముగా పలికెను.

ఓ మహారాజా! కార్తీకమాసమునకు యింత ప్రత్యేగతగలదు. దాన ధర్మాదులు ఎంత స్వల్పమైననూ, నిష్ఠవలన అవిపూర్తిఫలములు యిచ్చును. ఈ వ్రతఫలమును తెలిసియూ, కొందరు భోగములయందు ఆసక్తిచేత ఈ కార్తీకమాస వ్రతమును ఆచరించుటలేదు. అట్లుచేయని వారు శునకము, చండాలుడు మొదలుగా గల జన్మల నెత్తవలసియుండును. బ్రహ్మరాక్షసులై పుట్టి ప్రజలను హింసించుటకూడా జరుగును. ప్రాచీనకాలమందు జరిగిన ఒక విశేషమును చెప్పెదను. ఆలకింపుము అని వశిష్టుడు యిట్లు చెప్పనారంభించెను.

పూర్వము ఆంధ్రదేశమందు రామాపుర అగ్రహారం గ్రామమున గోపాలశాస్త్రి అనే ఒక బ్రాహ్మణుడు గలడు. అతడు తపోనిధి, గొప్పవిజ్ఞాని, ఇంద్రియ నిగ్రహము గలవాడు, అన్ని ప్రాణులను సమముగా గౌరవించు ఉత్తముడు. అతడు తీర్థయాత్రలు చేయదలంచి బయలుదేరి గోదావరి నదీప్రాంతమునకు వచ్చుచుండెను.

కోటివల్లి క్షేత్రమునకు సమీపమున పెద్ద మర్రిచెట్టు గలదు. ఆ చెట్టుతొర్రలో మహాభయంకరమగు ఆకారముగల బ్రహ్మరాక్షసి యొకటి నివసించుచూ ప్రాణికోటికి భయోత్పాతములు కలిగించుచుండెను.

ఆ మార్గమున వచ్చు బాటసారులను చూచి వింతగా ప్రశ్నించును. భయపడి పరుగులెత్తేవానిని భక్షించుచూ ఆ బ్రహ్మరాక్షసి కాలమును వెళ్ళబుచ్చుచుండెను.

కొంతకాలమునకు తీర్థయాత్రభిలాషుడై బయలుదేరిన బ్రాహ్మణుని ఆపి, వింతప్రశ్నలు వేయ నారంభించెను. బ్రాహ్మణుడు భయకంపితుడై భగవన్నామ స్మరణ చేయుచూ ఆ బ్రహ్మరాక్షసి ప్రశ్నలకు సమాధానములు చెప్పెను. అంత ఆ బ్రహ్మరాక్షసి ఆ వణికిపోవుచున్న బ్రాహ్మణుని చూచి యిట్లు చెప్ప నారంభించెను.

ఓ బ్రాహ్మణోత్తమా! భయపడవలదు. నీవలన నాకు శాపవిమోచనమగును. అనుగ్రహింపుమని పలువిధంబుల ప్రార్థించి తన వృత్తాంతము నిట్లు చెప్పెను.

ఓ విప్రోత్తమా! నేను పూర్వజన్మయందు ఒక బ్రాహ్మణుడను. కులాభిమానములను కుల ధర్మములను పాటించక యిష్టము వచ్చినట్లు ప్రవర్తించితిని. బ్రాహ్మణులను పండితులను దూషించితిని. వారు వీరు అనక అందరినీ బాధించి లంచములు గొనుచూ మిక్కిలి బాధించితిని. అతిధులను పూజించకపోగా ఇష్టము వచ్చినట్లు దూషించితిని. తల్లిదండ్రులను పూజింపకపోగా కనీసము వారికింత అన్నము నయిననూ పెట్టక, తిట్టి కొట్టితిని. ఇదియునూగాక నేనొక పూజారిని. దైవసంపదను స్వంతమునకు వినియోగపరచి దైవదూషణ చేసితిని. ఇన్ని పాపములు చేయుటయేగాక, వ్రత సహాయార్థము యాచించుచున్న ఒక బ్రాహ్మణుని దూషించగా అతడు మిక్కిలికోపించి, బ్రహ్మరాక్షసిగా పుట్టమని శపించెను. నేను పశ్చాత్తాపము చెంది మిక్కిలి ప్రార్థించగా అతడు దయతో నీ వింతప్రశ్నలకు సమాధానము చెప్పిన ఒక బ్రాహ్మణుని వలన, కార్తీక వ్రతఫలమును పొందిన తరువాత తిరిగి యధారూపము పొందుదువని శాపవిమోచనమును తెల్పెను. కావున ఓ బ్రాహ్మణోత్తమా! నన్ను అనుగ్రహించి శాపవిమోచనమును కలిగింపుము. అని బ్రహ్మరాక్షసి ప్రార్థించెను.

బ్రాహ్మణుడు బ్రహ్మరాక్షసి వృత్తాంతమునకు జాలిచెంది తనవ్రతఫలమును ధారపోయుటకు అంగీకారము తెలిపెను. తదుపరి ఆ బ్రహ్మరాక్షసి వెంటనిడుకొని కోటిపల్లి క్షేత్రముజేరి, అచట స్నానముజేసి సశాస్త్రీయముగా, తన కార్తీక వ్రతఫలమును ధారపోసెను. వెంటనే బ్రహ్మరాక్షసి అతనిని వీడి వెళ్ళిపోయెను.

ఆ సమయమున స్నానము చేయుచున్న కొందరు ఈ వింతను చూచి, ఈ కార్తీక వ్రతమును దేశదేశములు చాటిరి. యిట్టి మహాత్మ్యముగల కార్తీకమాస వ్రతమును గూర్చి ఎవరు చెప్పగలరు. అందున కార్తీకవ్రతముజేసి, జీవనదులయందు స్నానముజేసి, దానధర్మాదులుజేసి, నీవునూ కృతార్థుడవగుము అని చెప్పాడు.

# 4. కార్తీక దీపదాన మహిమ

కార్తీకవ్రతమహిమను విని జనకమహారాజు వశిష్ఠుని చూచి, ఓ మహర్షీ! వ్రతమహిమ వింటిని. కార్తీకమాసమున ఏ దానమిచ్చుట ఉచితమో తెలియజేయండి అనగా, వశిష్ఠుడు జనకుని చూచియిట్లనియె.

ఓ జనకమహారాజా! అది ఇది యను భేదములేక అన్ని దానములను ఈ కార్తీకమాసమునందు జేయవచ్చును. అందు దీపదానము ముఖ్యమయినది. దీనిని శివకేశవాలయములలో ఎచటనయిననూ, సూర్యాస్తమయి సమయమునందు మాత్రమచేయవలయును. ఆలయమందు దానముచేయునపుడు, గోపురమందుగాని, గోపురద్వారమందుగాని మండపమునందుగాని జేయవలయును. అట్లు జేసినవారు సర్వపాపమును పోగొట్టుకొన్నవారగుదురు. ఆవునేయి, నూనె, ఆముదము వేటితోనైనను ఈ దీపారాధన జేయవచ్చును. భక్తితోగాని, కోరికలతోగాని, లేకుండాగాని ఎట్లుజేసిననూ ఫలితంమాత్రం యొకటియే.

ఇట్లు దీపదానము జేయవలయును. ఈ దీపదానమునకు గొప్పమహిమ కలదు. ఆ మహిమను తెల్పు చిన్న కథ చెబుతాను. సావధానుండవై ఆలకింపుము.

పూర్వకాలమున పాంచాలమను దేశముగలదు. ఆ దేశమున మహా ఐశ్వర్యములు గల్గిన ఒక మహారాజు గలడు. కాని అతనికి సంతానములేదు. సంతానలేమికి ఎంతో చింతించి గోదావరితీరమునకు వెళ్ళి తపముచేయు నారంభించెను. అట్లు కొంతకాలము జరిగెను. పిప్పలాదుడను మహర్షి అచటికి వచ్చుట తటస్థించెను. మహారాజును చూచి, తపముచేయుటకు కారణమడుగగా సంతానము కొరకని మహారాజు జవాబు చెప్పెను. అందుకా ఋషి ఓ మహారాజా! పండితుల సలహాతో పరమశివునకు యిష్టమగు పని చేయుము. నీకు పుత్రుడు గల్గును అనెను.

అంత మహారాజు ముని సలహా ననుసరించి స్వగృహమునకు తిరిగివచ్చెను. బ్రాహ్మణులను పిలిచి అడుగగా కార్తీకమాసమున శివాలయమున భక్తితో దీపారాధన చేయవలసినదనియూ, అందువలన పుత్రోదయము కలుగుననియూ చెప్పిరి. మహారాజు కార్తీకమాసమున దీపారాధన గొప్ప భక్తిభావముతో చేసెను. కొంత కాలమునకు మహారాజు భార్య గర్భముధరించి యొక శుభదినమున పుత్రుని గనెను.

రాజు దీపదాన మహిమకు ఆశ్చర్యపడి, తన రాజ్యమునందు అందరునూ దీపదానము చేయవలసినదిగా శాసించెను.

ఆ బాలునకు సర్వవిద్యలనూ నేర్పించిరి. యుక్తవయస్సు వచ్చినది. రాజకుమారుడు చెడుసావాసముల వలన పూర్తిగా చెడిపోయెను. మహారాజదంపతులు కుమారుని చెడుప్రవర్తన చూచియూ చూడనట్లూరకుండిరి. రాజకుమారుడు క్రమముగా వేశ్యాలోలుడై ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించుచుండెను.

ఇట్లుండ ఒకనాడు మహాసౌందర్యవతియగు ఒక బ్రాహ్మణవనితని చూచి రాజకుమారుడు మోహావేశుడయ్యెను. కామవికారములను అణచిపెట్టుకొని, ఆ వనిత వద్దకుపోయి తనకోరికను తెల్పెను. ఆమెయు రాకుమారుని సౌందర్యమునకు పరవశురాలై అతనికి వశురాలయ్యెను. భర్త నిదురచెందియుండగా ఆమె రహస్యముగా ఏర్పాటు చేసుకున్న సంకేతస్థలమునకు వెళ్ళి, రాజకుమారునితో కామక్రీడలు సలుపుచుండెను. కొంతకాలముకు ఈ విషయము బ్రాహ్మణునకు తెలిసినది. భార్యను రాజకుమారునిని ఒక్కసారి చంపివేయుట కతడు సమయము కొరకు ఎదురుచూచుచుండెను.

యిట్లు కొంతకాలము గడిచినది. కార్తీకశుద్ధ పూర్ణిమనాడు ఆ బ్రాహ్మణియునూ, రాజకుమారుడనూ ఒక దేవాలయమున కలుసుకొనిరి. బ్రాహ్మణుడు ఈ విషయము ముందుగనే తెలుసుకొనే గర్భగుడియందు దాగియుండెను.

రాజకుమారుడు బ్రాహ్మణయువతిని చూసి దీపమున్న బాగుండునని యనగా ఆమె చీరకొంగు చించి వత్తినిచేసి దీపము వెలిగించెను. అనంతరము వారు రతిక్రీడలో తేలియాడుచుండిరి. అది చూసిన ఆమె భర్త సహించలేక భార్యను కత్తితో నరికివేసెను. రాజకుమారుని కంఠముపైన కత్తితో బలముగా కొట్టెను రాజకుమారుడు చనిపోవుచూ బ్రాహ్మణుని కత్తితో పొడిచెను. ఆవిధంగా ఆ దేవాలయమునందు ఆ ముగ్గురునూ చనిపోయిరి.

శివదూతలు అరుదెంచి రాజకుమారుని బ్రాహ్మణయువతిని కైలాసమునకు తీసుకొనిపోవుచుండిరి. బ్రాహ్మణుని యమదూతలు నరకమునకు గొనిపోవుచుండగా బ్రాహ్మణుడు యమదూతలను చూచి, నేను నిత్యాగ్నిహోత్రుడను, వేదవేదాంగ

పారంగతుడను. వారు యిరువురు స్వధర్మములను మరచిపోయిన వ్యభిచారులు. వారు కైలాసమునకును నేను నరకమునకునా- యిది యేమి? అని ప్రశ్నించగా యమదూతలు యిట్లు చెప్పిరి.

ఓయి బ్రాహ్మణుడా! వారలు ఎటువంటివారయిననూ, కార్తీక పూర్ణిమనాడు తెలిసిగాని తెలియకగాని దీపారాధన, దేవాలయమున చేసిరి. వారికి ఆ దీపదాన ఫలము దక్కినది. కావున వారికి కైలాస ప్రాప్తియు, అట్టి పుణ్యదినమున వారిని హత్యచేసిన నీకు మహాపాపము కల్గినది. కావున నీకు నరక ప్రాప్తి కలిగినది. వారు ఆ దీపదాన ఫలితములో కొంత భాగము నీకొసంగిన నీ పాపము నశించి నీకు కైలాసప్రాప్తి కల్గును. అది విని రాజకుమారుడు, ఆ బ్రాహ్మణుడొనరించిన పాపమునకు తాను కారణమనియు కావున తపఃఫలితములో కొంత భాగమును యిచ్చుచుంటిననియు చెప్పెను. అది విని యమదూతలు వెడలిపోయిరి. రాకుమారుడు, బ్రాహ్మణయువతియు, బ్రాహ్మణుడునూ కైలాసమునకు వెళ్ళిరి.

ఓ మహారాజా! ఎరుగక చేసిన దీపారాధన వలన ఫలితము కల్గినది. దీప దాన మహిమ ఎట్టిదో యోచించుము. కావున కార్తీకమాసమునందు దీపారాధన చేయవలయును. అట్లు చేయనివాడు రౌరవాది నరకములు పాలగును. కావున నీవును, శివకేశవాలయములలో నక్షత్రమాలికలలో దీపారాధనచేసి ధన్యాత్ముడవగుము. అని వశిష్ఠుడు దీపదాన మహిమను తెలియజేసెను.

## 5. కార్తీక పురాణ శ్రవణ మహిమ

వశిష్ఠుడు జనకమహారాజుతో ఇలా అనెను.

ఓ మహారాజా! కార్తీకమాసమున శివకేశవ ఆలయములలో ఎందయిననూ ముందు భగవద్గీత పారాయణము చేయవలయును. యిందువలన సర్వపాపములు పోవును. శ్రీనారాయణునకు ఇష్టమగు కరవీరపుష్పములతో పూజించిన నారాయణ సాన్నిధ్యము లభించును. భగవద్గీతను పూర్తిగా చదవలేనివారు కనీసము విభూతి విశ్వసందర్శన పురుషోత్తమ ప్రాప్తియోగముల నయిననూ పారాయణ చేయవలయును. శివని ప్రీతికై సాలగ్రామ పూజ చేయవలసియున్నది. తరువాత భగవత్ప్రీతికొరకు ఉసిరిక చెట్టుక్రింద భోజను చేయవలయును.

కార్తీకమాసమునందు జపము, హోమము, దేవతార్చన పితృతర్పణము, దానము మొదలుగునవి చేయవలయును. భోజనాంతరము ఆ ఉసిరిక చెట్టు క్రిందనే పురాణము చదువుటగాని వినుటగాని చేయవలయును. అట్లు చేయనివాడు నీచజన్మమును పొందును. అందులకు ఉదాహరణగా నీకొక కథ చెప్పెద శ్రద్ధగా వినుము.

పూర్వము మాధవశర్మయను బ్రాహ్మణుడు కావేరి నదీతీరమున గల నొక గ్రామమున నివశించుచుండెను. అతనికి విష్ణుశర్మయను కుమారుడు గలడు. విష్ణుశర్మ చిన్నతనమునుండియు, తల్లిదండ్రులమాటగాని పెద్దలమాటగాని వినక మిక్కిలి చెడ్డవాడై వర్తించుచుండెను. ఒకనాడు వానిని చూచి మాధవశర్మ ఓరీ దుర్మార్గా! నీవు నా కడుపున చెడబుట్టితివి. నా కీర్తికి నీవలన భంగము కలిగినది. అయిననూ నా కుమారుడవై జన్మించినందులకు నీకొక ఉపాయమును తెలిపెదను. కార్తీకమాసము నందు శివకేశవాలయములలో దీపారాధన చేయుము. నీ పాపములన్నియు హరించిపోవును అని చెప్పెను.

కాని విష్ణుశర్మ వీటిని లక్ష్యపెట్టలేదు. కార్తీక వ్రతమును దీపారాధనను, చులకనగా ఎంచి మిన్నకుండెను. కనీసము నదియందు స్నానమైనను చేయలేదు. ఇదిచూచి మాధవశర్మ మిక్కిలి కోపించి ఏదైనా అడవిలో ఎలుకవైజన్మించమని శపించెను. బ్రాహ్మణశాపము ఊరికే పోదుగదా! ఆ వాక్యములకు భయపడి క్షమింపుమని విష్ణుశర్మ తండ్రి పాదములపైబడెను.

మాధవశర్మ కుమారుని అవస్థకు చింతించి, విష్ణుశర్మ! నీవు కార్తీకవ్రతమును చులకనగాయెంచితివి. కావున కార్తీకపురాణమును వినగలిగిననాడు నీవు యథారూపమును పొందగలవని శాపవిమోచనమును తెల్పెను. ఇట్లు శాపవశమున విష్ణుశర్మ అడవిలో ఎలుకగా జన్మించి, కాయధ్యానములను తినుచూ బ్రతుకుచుండెను. కావేరిస్నానమునకు వచ్చువారు ఆ ఎలుక నివసించుచున్న చెట్టుక్రిందనే సామాన్యంగా కూర్చొనుచుందురు. కొంతకాలమట్లు గడిచిపోయిన తదనంతరము ఒకసారి విశ్వామిత్రుడు తనశిష్యులతో కావేరీనదియందు స్నానాదులను నిర్వర్తించి ఆ చెట్టునీడను కూర్చుండి శిష్యులకు ఏదియో చెప్పుచుండగా ఎలుక చాటుగా వారి ఆహార పదార్థములను దొంగిలించి చెట్టు వేరులసందున దాగియుండెను.

అట్లు కార్తీకమాసము జరుగుచున్నది. ఒకనాడు ఒక బోయవాడు వీరిని చూచెను. వారిని చంపి ధనముల నపహరించు యుద్దేశ్యముతో అచటికి వచ్చెను. కాని విశ్వామిత్రమహర్షిని చూచినంతనే వాని దుర్బుద్ధి అంతరించిపోయినది. మహర్షికి నమస్కరించి అయ్యా! మీరు చెప్పినదేమి అని ప్రశ్నించెను. శిష్యులలో ఒకరు ఓయీ! ఇది కార్తీకమహాత్మ్యము! స్నానము చేసినతరువాత ఈ పురాణమును విన్ననూ, చదివిననూ, సర్వపాపములు హరించును అని చెప్పగా ఆ బోయి కావేరిలో స్నానమాచరించి ఆ కార్తీకపురాణమును విని తన పాపములకు ప్రాయశ్చిత్తము కల్గించుకొనెను. చెట్టు వేళ్ళచాటున ఉన్న ఎలుకయూ ఈ పురాణమును వినెను. వెంటనే శాపవిమోచనమై ఆ ఎలుకకు యదార్థమైన రూపము వచ్చెను. రాజర్షికి నమస్కరించి కార్తీక మహాత్మ్యము కీర్తించుచు స్వగృహంబునకు మరలెను.

కావున మోక్షము కోరువారు కార్తీక మహాత్మ్యమును తప్పక వినవలయును. నీవును విని ముక్తిపొందుము అని వశిష్టుడు జనకునితో మరలనిట్లు చెప్పెను.

## 6. మోక్షము పొందిన వితంతువు

మహర్షి వశిష్టుడు జనకమహారాజును చూచి యిట్లనియె :

ఓ మహారాజా! మానవుడు ఎప్పుడు ఏవిధమగు పుణ్యకార్యము చేసిననూ ఫలము తప్పక కలుగును.

కార్తీకమాసమునందు దీపారాధనను ముఖ్యముగా చేయవలయును. అంతియేగాక కార్తీకమాసమందు శివకేశవుల ప్రీతికొరకు పంచామృతములతోడను, సుగంధద్రవ్యముల తోడను పూజించిన వానికి యజ్ఞఫలము లభించును. మోక్షము లభించును. అటులే శివాలయమునందు దీపారాధన చేసిన కైలాసము, విష్ణ్వాలయమున చేసిన వైకుంఠము లభించును. ఈ దీపారాధనను ఏ తైలముతోనైననూ చేయవచ్చును. ప్రమిదను బియ్యంపిండితోగాని గోధుమపిండితోగాని చేయవలయును. ఈరీతిగా నెలయంతయూ చేయవలయును. అంతమున వెండి ప్రమిద చేసి అందు బంగారు వత్తినుంచి, వరిపిండిగాని గోధుమపిండిగాని అందుంచి ఆవునేతిని వేసి దీపారాధనచేసి నెలదినములు దీపదానములను పొందిన సద్బ్రాహ్మణునకు "సర్వజ్ఞాన ప్రదమగుగట్టియూ, సకల సంపదలను యిచ్చు ఈ దీపదానమును నీ కొసంగుచున్నాను.

నన్నాశీర్వదించి శాంతిని కల్గునట్లు చేయుము” అని దానమీయవలయును. అనంతరము ఆ బ్రాహ్మణునకు భోజన మిడవలయును ఈ విధముగా చేసి మాసాంతమున బ్రాహ్మణ సమారాధనగాని, అన్నదానముగాని చేయవలయును. ఈ విధముగా జాతిమత, కులభేదంబులు గాని, యెక్కువ తక్కువల భేదములుగాట లేక అందరునూ జేయవచ్చును. వ్యయము తక్కువ ఫల మధికము. ఇందులకుదాహరణముగా ముక్తిని పొందిన ఒక వితంతువు గాథను వినుమని యిట్లు చెప్పనారంభించెను.

పూర్వకాలమున ద్రావిడదేశమందుగల యొకకుగ్రామమందు ఒక శూద్రయువతి నివసించుచుండెను. ఆమె చుట్టపక్కముల ఎవరూలేని యేకాకి. దాసివృత్తిచే కాలము గడుపుచు వచ్చిన పదార్థములను అమ్మియు, వచ్చు జీతమును దాచిపెట్టుకొనుచూ, కొంత కాలమునకు హెచ్చువడ్డీలను అప్పులునీయ నారంభించెను. తాకట్టు వస్తువులను దొంగలు అపహరించిరని బొంకుతూ మోసము చేయుచుండెను. ఇట్లు భగవన్నామస్మరణగాని, అటు గుప్పెడుముష్టివేయుటగాని తాను యింత తినుటగాని లేక లోభియై ధనార్జన చేయుచుండెను.

కొంతకాలము యిట్లు గడచిపోయెను. ఒక సమయమున శ్రీరంగము యాత్రార్థము పోవుచున్న బ్రాహ్మణుడొకడు, ఆ మార్గమున పోవుచూ ఆమె సంగతి విని దయగలవాడై ఆమె వద్దకు వెళ్ళి ఈ మాదిరిగా చెప్పెను.

“ఓ తల్లీ! వేరు విధముగా తలంచక నా మాటలు వినుము. దేహము నీటిబుడగవంటిది అనిత్యము. దేహమున్నంతవరకే ఈ అభిమానముండును, పంచభూతాత్మకమైన ఈ శరీరము చివరకు ఆ పంచభూతములందు ఐక్యమై పోవుచున్నది. ఈ శరీరము నిత్యమని తలంచుట మహా అజ్ఞానము. అందులకు చేయరాని పాపములు చేయుట, ఇతరులను మోసగించుట పరులసొమ్మునకాశపడుట, దాన వ్రతాదులు చేయకపోవుట మహాపాపములై యున్నవి. కీటకము దీపమును తినేవస్తువని భ్రమించి ఆ దీపమున పడి నాశనమగుచున్నది. కావున నాశనమార్గమున పడక, కామ, క్రోధ, మోహ, లోభ మద, మాత్సర్యములను విడిచి పెద్దలను గౌరవించి శక్తికొలది దానధర్మములు చేయుము. ఇంతియేగాక కార్తీక మాసమున నిత్యము స్నానముజేసి శివకేశవాలయములలో ఎందైనా దీపారాధన గావించి ముక్తినొందుము”

అని చెప్పి తనదారిన తాను పోయెను. ఆ వితంతువు బ్రాహ్మణుని బోధలు విని మనస్సు మార్చుకున్నది. ప్రతిదినమూ యేదో ఒక దానము చేయుచు, అతిధులను పెద్దలను పూజించుచూ కార్తీకమాసమందు దీప దాన వ్రతముజేసి పురాణశ్రవణము గావించి, బ్రాహ్మణ సమారాధన గావించి జన్మరాహిత్యమును పొంది పుణ్యలోకాలకు వెళ్ళినది. కావున ఓ జనకచక్రవర్తీ! నీవునూ యిట్టి మహత్తర దీపదాన వ్రతమొనరించి జన్మరాహిత్యము పొందుమని ఈవిధముగా చెప్పినాను.

## 7. వనభోజనము పుష్పార్చన దీపారాధన విధులు

వసిష్ఠమహర్షి జనకునిచూచి ఓ రాజా! కార్తీకమాసమందు సర్వులూ చేయదగిన విధులను గూర్చి తెలిపెదను. సావధానుండవై వినుము.

**కార్తీక వనభోజనము :** కార్తీకమాసమునందుగల ప్రత్యేకవిషయములలో ఇది ఒకటి. ఎవరు బ్రాహ్మణులతో కలిసి ఉసిరిచెట్టు క్రింద భోజనము చేయుదురో వారు సర్వపాపములు పోగొట్టుగొనిన వారగుదురు.

**దేవతా పుష్పార్చన :** కార్తీకమాసమునందు సర్వులూ శివకేశవులను పుష్పములతో పూజింపవలయును. కమలములతో పూజించినవారియింట లక్ష్మి స్థిరముగా యుండును. తులసిదళములతో నయినను సహస్రనామార్చన చేయవలయును. ఈ మాసమునందు సాల గ్రామములను పూజించినవారికి సత్ఫలములు కలుగును. విష్ణువును అవిసిపూలతో పూజించినవారికి యజ్ఞఫలములు సమకూరును. తులసికోటవద్ద ముగ్గులు పెట్టినవారు పుణ్యాత్ములగుదురు. శివుని జిల్లేడు పూలతో పూజించినవారికి అరిష్టములు నశించి ఆయుర్వృద్ధి కలుగును. మల్లె, గులాబి, జాజిపూలతో పూజించినవారికి సర్వపాపము నశించును. అవిశపూలచే పూజించినవారు ధనవంతులగుదురు. తులసి ఆకులచే పూజించినవారు విష్ణుసాయుజ్యమును, బిల్వపత్రములతో అర్చించినవారు శివసాయుజ్యమును పొందుదురు.

**కార్తీకంలో దానములు :** ఈ మాసమున ఏ పుణ్యకార్యము జేసినను పుణ్యగతులు గలుగును. వస్త్రదానము చేసినవారు అశ్వమేధయాగఫలము నొందుదురు. అన్నదానముచేసిన వారి సర్వపాపములు పోవును. తిలదానము చేసినవారి భవిష్యత్తు ఆనందముగా యుండును.

**కార్తీక దీపారాధనలు :** దీపారాధనను గూర్చి పూర్వ అధ్యాయము నందు వివరముగా ఈయబడినది. ఏమయిననూ దీపారాధనము కార్తీకమునందు అన్నిటికంటె ముఖ్యము. తులసిచెట్టు వద్ద ఆవుపేడతో అలికి ముగ్గులుపెట్టి అందు నువ్వులుపోసి, దానిపై పెద్దప్రమిదెనిండుగ నువ్వులనూనె పోసి, దీపారాధన చేయవలయును. దీనిని ఆనంద దీపమందురు. ఆనందదీపమును కార్తీకమాసమున నెలదినములు ఉంచినవారు ఏ దేవాలయమందైననూసరే బ్రహ్మజ్ఞానమును పొందుదురు. ఆ దీపము నెలదినములూ ఉండవలయును. ఆరిపోరాదు. ఆరిపోయిన బ్రహ్మహత్యామహాపాతకము చుట్టుకొనును.

ఈ మాసమున నిష్టతో భక్తినియములతో మంత్రజపంబులతో దేవతార్చనచేసి ఏ మంచిపని చేసినను కార్తీకవ్రతఫలము గలుగును. దేవాలయములయందు, నృత్యగీత విశేషములు చేయించినవారికి పరమపదము లభించును.

ఈ మాసమంతయూ చేయలేనివారు కనీసము ఒక్క ఆదివారమునాడయిననూ చేయవచ్చును. కార్తీక పాడ్యమి, పూర్ణిమ, అమావాస్యయందయిననూ స్నానాదులు గావించి దీపారాధనలచేసిన చాలును. ఇట్టివారికి సర్వసౌఖ్యములు కల్గును.

## 8. అజామీళుని వృత్తాంతము

వశిష్ఠునితో జనకరాజు ఈవిధముగా పలికెను.

మహామునీ! మీరు చెప్పిన ధర్మముల వింటిని. ధర్మములు మహాసూక్ష్మములని గదా. ఈ సూక్ష్మధర్మములు నదీస్నానము, ఫలదానము, అన్నదానము, వస్త్రదానము, దీపదానమువలన సకలపాపములు హరించుకునని చెప్పుచున్నారు. కాని సర్వపాపములు కేవలము వేదోక్తమగు ప్రాయశ్చిత్తములవలననే పోవునని మహాత్ములవలన వినియుంటిని. అట్టి వేదోక్తప్రాయశ్చిత్తము వలన నశించు పాపములు, ఈ చిన్న దానమువలన పోవునా? గడ్డిపరక నాధారముగా గట్టు నెక్కగలమా, కుక్కతోకతో గోదావరి ఈదగలమా? ఈ సంశయమును బ్రహ్మర్షులగు తమరే తీర్చవలయును. పంచమహాపాతకములు–వైశాఖ, ఆషాఢ, శ్రావణ, కార్తీక, మాఘమాసముల యందు చేసిన స్వల్పదానములవలన పోవునట దీని యర్థమేమి? ఇదియుగాక, సర్వ పాతకములను పోగొట్టి పవిత్రతను కలుగజేయునదేది, దేశమా? కాలమా? దానమా? ఈ సంశయమును కూడా తీర్చి నన్ననుగ్రహించవలసినది, అని పలువిధముల ప్రార్థించిన వశిష్ఠుడు జనకునకిట్లు చెప్పెను :

ఓ రాజా చక్కని ప్రశ్న వేసితివి. ధర్మములు సాత్విక, రాజస, తామస ధర్మంబులని మూడు విధములుగా ఉన్నవి. సత్వగుణము జనించి, మనోవాక్కాయ కర్మల ద్వారా ఫలమంతయు పరమేశ్వరార్పణముచేసి ఉత్తమకర్మలుచేయు ధర్మమును సాత్వికధర్మమందురు. ఆ ధర్మఫలమెంతో అధికము. ఈ ధర్మమువలన సకల పాపములు నశించి పవిత్రత లభించును. కేవలము చిన్నబిందువు ముత్యపుచిప్పలోపడి మంచి ముత్యమగుచున్నది. ఆ చిన్న నీటిబిందువునకు అందువలన యెంతో ప్రాముఖ్యత కల్గుచున్నది.

అటులనే సదాచారములు గలిగి, కార్తీకమాసమున గంగా గోదావరీ నదులయందుగాని, పుష్కరకాలమందు జీవనదులయందుగాని స్నానముచేసి, బ్రాహ్మణునకు ఏ స్వల్పదానముచేసిననూ స్వయముగా దేవాలయమున దీపారాధనలు చేసిననూ జప తపాదు లొనరించినను ఫలము తప్పక కలుగును.

ఇక రాజధర్మము నీకు తెలియని దేమి? అడిగినవారికి లేదనకుండుటయు సర్వుల కోరికలు తీర్చుటయే రాజధర్మము.

శాస్త్రోక్తమగు విధానములను విడిచి, దేశకాల పాత్రతలు చూడక పరులు సంతోషించుటకు చేయు ధర్మమును తామస ధర్మమందురు. ఈ ధర్మము ఫలరహితము.

ఫలాపేక్ష కలిగి శాస్త్రవిధులు విడిచి చేసిన ధర్మము అధర్మమయియున్నది. ఈ అధర్మమే పునర్జన్మకు కారణమైయున్నది.

ఇందొక ధర్మసూక్ష్మమున్నది. దేశ కాల పాత్రతలన్నియు సమకూడినపుడు తెలిసిగాని తెలియకగాని చేసిన దానమునకు ఫలము తప్పక కలుగును. పెద్ద గడ్డిమేటిని చిన్న నిప్పురవ్వ నశింపజేయును, అటులే యింటియందు చిన్న దీపము ఆ యింటిలోని చీకటి నెట్లు పోగొట్టునో ఆ మాదిరిగా భగవన్నామమును తెలిసిగాని తెలియక గాని స్వల్పముగానయినను స్మరించిన చాలునని శాస్త్రములు చెప్పుచున్నవి. అందువలన అన్ని పాపములు హరించిపోవును. ఈవిధంగా ఫలమునుబొందిన ఒక మహనీయుని చరిత్రను పూర్తిగా విని ఆనంద పరవశుడవుగమ్ము అని వశిష్ఠుడు కథావృత్తాంతమును చెప్పనారంభించెను.

పూర్వము కన్యాకుబ్జమను పేరుగల మహానగరమొకటికలదు. ఆ నగరమందు సకలశాస్త్ర పారంగతుడైన బ్రాహ్మణుడొకడు కలడు. అతనిపేరు సుశర్మ. ఆతనికి సావిత్రియను సద్గుణరాశియగు భార్యగలదు. వారిరువురును అన్యోన్యముగా కాపురము చేయుచుండిరి. కొంతకాలమునకు వారికొక కుమారుడు జన్మించెను. ఆ దంపతులు ఆ కుర్రవానికి అజామీళుడు అని నామకరణము జేసిరి.

అతిగారాబమువలన అజామిళుడు ఎవరినీ లక్ష్యపెట్టక ఇచ్ఛవచ్చినట్లు తిరుగుచుండెను. విద్యాబుద్ధులు అలవడలేదు. యుక్తవయసు వచ్చినది స్వధర్మములను వదలిపెట్టి ఒక దాసీస్త్రీయందు మోహం కలవాడై తలిదండ్రులను, పెద్దలను వదలి నిర్భయముగా ఆమె యింటనే వసించుచుండెను. సంధ్యావందనము, నిష్ఠను వదలి వేటాడుటయందు ఆసక్తి చూపుచుండెను. నిత్యము వేటకు ఆమెతోకలసి వెళ్ళేవాడు. ఒకనాడు అడవిలో ప్రమాదవశమున ఆమె మరణించినది. అమెకొరకు కొంతసేపు దుఃఖించి ఆమెను భూమిలో పూడ్చి యింటికి తిరిగివచ్చెను.

ఆ దాసీయువతికి ఒక కుమార్తె గలదు. ఆమె ఈ వార్తవిని మిక్కిలి దుఃఖించుచుండెను. అజామిళుడు ఆమెను ఒడిలోనికి తీసికొని ఓదార్చెను. సహజముగా చెడువర్తనకలిగిన అజామిళునికి వావివరసల భేదము నసించినది. కుమార్తెయందు మోహము గలిగినది. ఆ విషయమును ఆమెకు తెలిపెను. ఆమెయు యుక్తవయస్కురాలు. వెంటనే అంగీకరించెను. వారిరువురుకు కొంతకాలమునకు ఒక కుమారుడు జన్మించెను. అజామిళుడు బాలునకు నారాయణుడను పేరుపెట్టి, ఆ బాలుని విడిచిపెట్టలేక నిరంతరము నారాయణ అని పిలుచుచు మిక్కిలి ప్రేమతో చూచుచుండెను. కొంతకాలమునకు ఆతనికి మరణసమయమాసన్నమైనది. అతని గొనిపోవుటకై యమభటులు అరుదెంచిరి, అజామిళుడు వారిని జూచి మిక్కిలి భయపడి, నారాయణా యని కుమారుని యొక్కసారి పిలిచి మరణించెను.

ఆ నారాయణ శబ్దమువిని యమదూతలు వణికిపోయిరి. అంతలో దివ్యరూపముగల విష్ణుభటులు అరుదెంచిరి. అతనిని పుష్పక విమానమెక్కించగా, చూచి యమదూతలువచ్చి, అయ్యా! మీ రెవరు? వీడు దుర్మార్గుడు. బ్రాహ్మణ్యమును విడిచిపెట్టి కలుషితుడైన వీనిని మీ రెచటకు గొనిపోవుచుంటిరని ప్రశ్నించిరి.

అందులకు యమదూతలను చూచి విష్ణుదూతలు యిట్లనిరి

## 9. నారాయణ నామమమహిమ

విష్ణుదూతలు యమదూతల చూచి మేము విష్ణుదూతలము, మీరెవరు? అని ప్రశ్నించగా, యమదూతలు ఇట్లు చెప్పిరి : "మేము యమదూతలము. మారాజు ఆనతి ప్రకారము వీనిని గొనిపోవుటకు వచ్చియుంటిమి." అనగా విష్ణుదూతలు ఓ యమకింకరులారా! మీ ప్రభువు ఎట్టివారిని పాపులుగా నిర్ణయించునో తెలుపగలరా? అని ప్రశ్నించిరి. ఆ ప్రశ్నకు యమదూతలు యిట్లు సమాధానము చెప్పిరి.

ఓ విష్ణుదూతలారా! సూర్యచంద్రాదులు మొదలుగాగల పంచభూతములు, మానవులుచేయు పాపములను మారాజునకు విన్నవించగా మారాజు చిత్రగుప్తుడు వ్రాసిన పత్రములను చూచి విమర్శించి, ఆ జీవుని తీసుకొని రావలసినదిగా మమ్ములను పంపును. అని పలికిరి అది వినిన విష్ణుదూతలు పాపులనగా ఎవ్వరు? అని ప్రశ్నించిరి.

ఓ విష్ణుదూతలారా! పాపులనగా ఎవ్వరో వినుడు. పాపులు అనగా మహాపాపములను చేసినవారు. సద్ధర్మములను, కులాచారములను విడచినవారును, సజ్జనులను పెద్దలను, తల్లిదండ్రులను దూషించినవారును, జీవహింస చేయువారును, డాంబికులు, దొంగసాక్షులు, పరస్త్రీలయందు వ్యామోహము గలవారు, కృతఘ్నులు, నిత్యకర్మలు, పితృకర్మలు విసర్జించినవారును పరాన్నభుక్కులునూ వీరు మహాపాపులనబడుదురు. అటువంటివారు నరకమునకు గొనిపోవుదురు. ఈ అజామీళుడు బ్రాహ్మణుడు. కులధర్మములను విసర్జించి పరదారయందు మోహము కలిగి ఆమె చనిపోగానే కుమార్తెతో రతిక్రీడలు చేసిన మహాపాపి. అందువలన ఈతనిని నరకమునకు గొని రావలసినదిగా మా ప్రభువు యమధర్మరాజు ఆజ్ఞాపించెను. అని చెప్పగా ఆ మాటలు విని విష్ణుదూతలు యమదూతలతో యిట్లనిరి.

యమకింకరులారా! మీకు ధర్మాధర్మములయందలి ఆంతర్యములు తెలియవు.

సజ్జనులతోడి స్నేహము, పరోపకారము, నిత్యకర్మలయందాసక్తిగలవారు అన్నదానము, గోదానము, కన్యాదానము చేయువారు, పెద్దలను అతిథులను గౌరవించినవారును పుణ్యాత్ములు అనబడుదురు. ఇవన్నియు లేకనే కేవలము తెలిసిగాని, తెలియకగాని భగవన్నామము చేసిన గొప్ప పుణ్యఫలము లభించును. ఈ అజామిళుడు పరమ నికృష్టుడే అయినను అవసానకాలమున నారాయణా అని భగవన్నామము చేయుటచే యితడు పుణ్యాత్ముడయ్యెను. ఈతనికి స్వర్గలోకప్రాప్తి గలిగినది.

అదివిని ఏమియుచేయలేక యమదూతలు మరలిపోయిరి. అజామిళుడు కేవలము నారాయణ అను నామమునకే ఇంత ప్రభావము గలదని తెలిపి ఎంతయు సంతసించి విష్ణుదూతలతో వైకుంఠమునకు వెళ్ళెను. కావున ఓ జనకచక్రవర్తీ! నారాయణ నామమహిమ ఎట్టిదో గమనించుము. ఇందులకు పూర్వజన్మ సుకృతముగూడా అవసరమైయున్నది. అని చెప్పెను.

అదివిని ఓ మహర్షీ : అజామీళుని పూర్వజన్మ వృత్తాంతమును నాకు వినిపింపుమని యడుగగా వసిష్ఠుడు అజామిళుని పూర్వజన్మ వృత్తాంతమును యిట్లు చెప్పనారంభించెను.

## 10. అజామీళుని పూర్వజన్మ వృత్తాంతము

వశిష్ట మహాముని జనకరాజున కిట్లనియె.

జనకమహారాజా! అజామిళుడు పూర్వము మహారాష్ట్ర దేశమునందొక శివాలయమున శివార్చకుడు. మంచి అందగాడు. అతనిని ఒక బీద బ్రాహ్మణయువతిని మోహించి తన కోర్కెను తెల్పగా శివార్చకుడును అంగీకరించి ఆమెతో రహస్యసంబంధము ఏర్పరచుకొనెను. బీద బ్రాహ్మణునకు ఈ విషయము తెలిసినది కాని ఏమీ చేయలేక యూరుకుండెను.

ఒకనాడు ఆ బ్రాహ్మణుడు బిక్షాటన గావించి మధ్యాహ్నము యింటికి చేరి వంట త్వరగా కానిమ్మని అనగా అపుడు శివార్చకునితో రతిక్రీడలలో తేలియాడుచున్న బ్రాహ్మణ యువతి మిక్కిలి కోపించి ఆ బీదబ్రాహ్మణుని కొట్టి బయటకు గెంటివేయగా ఆ బ్రాహ్మణుడు మిక్కిలి దుఃఖించి దేశాటనకు పోయెను. అంతట ఆ బ్రాహ్మణ భార్య స్వేచ్ఛగా వ్యభిచారముచేయ నారంభించెను.

అట్లు కొంతకాలము గడచిన అనంతరము ఆమె ఒక నాటి సాయంత్రము బయట నిలబడియుండగా ఒక చాకలివాడు ఆ మార్గముగుండా పోవుట చూచినది. వాడు మిక్కిలి బలిష్టుడు, అందగాడు, వానిని పిలిచి తనతో సుఖించవలసినదిగా కోరగా ఓ యమ్మా ! నీవు బాపనమ్మవు, నేను చాకలివాడిని, నీవు కులాచారము వదలినను నేను వదలలేనని చెప్పి ఆ చాకలి తన దారిన పోయెను.

ఆ బ్రాహ్మణ యువతి ఈ మాటలకు కలత జెందినది. ఆమె హృదయము పశ్చాత్తాపముతో నిండిపోయినది. ఒక కూలివానినిపిలచి కొంత ధనము వాని చేతియందుంచి భర్తను వెదకి తీసుకురావలసినదిగా చెప్పెను. భర్త ఇంటికి తిరిగివచ్చెను. ఆమె భర్త పాదములపై బడి, కులాచారములను, ధర్మములను వదలిన తనను రక్షించ మనియు, క్షమించమనియు ప్రార్థించగా బ్రాహ్మణుడు కరుణతో ఆమెను క్షమించెను. తిరిగి వారిరువురు సుఖముగా నుండిరి. ఆమె వ్యభిచారమును మాని భర్తతో సుఖంబుగ నుండెను. కొంతకాలము గడచినది. శివార్చకుడు రోగపీడితుడై మరణించి నరక బాధలుపొంది మరల యొక బ్రాహ్మణుని యింట జన్మించి కార్తీకమాసంబున ఒక దినమున స్నానముచేసి దైవదర్శనము చేసెను. అందువలన అతని ఏడుజన్మల పాపములను నశించినవి. పాపశేషము వలన భగవన్నామము ఉచ్ఛరించుటచేత అతడు పాపరహితుడై వైకుంఠమును జేరెను.

ఆ బ్రాహ్మణుని భార్యయు మరణించి నరకబాధలు అనుభవించి ఒక మాలవాని ఇంట పుట్టినది. ఆ పిల్ల తండ్రిగండమున పుట్టినదని ఎవరో చెప్పగా ఆ మాలవాడు భయమునొంది ఆ పిల్లను అడవిలో ఒకచోట ఉంచి తనదారిన తాను పోయెను.

ఆ దారినే పోవుచున్న బ్రాహ్మణోత్తముడొకడు ఆ శిశువును చూచి తన యింట దాసీదానికి అప్పగించెను. ఆ శిశువు పెద్దదైదాసీగా బ్రాహ్మణుని యింట చేరినది. ఆమెనే తిరిగి అజామిళుడు మోహించెను.

అని వశిష్టుడు అజామిళుని పూర్వ వృత్తాంతమును ముగించి తిరిగి, ఓ జనకమహారాజా! నిర్మలమగు మనసులేని దానధర్మములు, ప్రాయశ్చిత్తములు, పాపములను హరింపజాలవు భగవన్నామమువలన అజామిళుడు వైకుంఠవాసి అయ్యెను. భగవద్భక్తులందరికిని మోక్షము లభించునని శాస్త్రములు ఘోషించుచున్నవి.

శక్తియున్న దేశకాలపాత్రములను అనుసరించి దానధర్మములను చేయవలయును. శక్తియుండియు చేయనివారు నరక భాదలు పొందుదురు. ఈ కార్తీక పురాణమును వినువారును, చదివినవారును కైవల్యము నందగలరు. వశిష్టమహాముని జనకరాజునకు ఈ విధముగా భగవన్నామ మహిమనుగూర్చి తెలియజేసెను.

# 11. నాగేశ్వరశర్మ వృత్తాంతము

వశిష్టుడు జనకమహారాజును చూచి ఓ రాజా! కార్తీక మహాత్మ్యమును గూర్చి పూర్తిగా వినిపించెదను. నీ సందేహములు నివృత్తి కాగలవు అని యిట్లు చెప్పనారంభించెను.

కార్తీకమాసమున ఎవరు అవిసెపూలతో భగవానుని పూజించెదరో పాపరహితులై వైకుంఠము చేరుదురు. వస్త్రాదులచే అలంకరించినవారు హరి సాన్నిధ్య భాగ్యమును పొందుదురు. పురాణమును చదివినవారును విన్నవారును హరి సేవకు లగుదురు. దీనికి సంబంధించిన కథ పురాతన కాలమున జరిగెను. ఆ విషయము ఆలకింపుము.

పూర్వం కళింగదేశమునందు నాగేశ్వరశర్మ అను బ్రాహ్మణుడుగలడు. అతడు ఆస్తులు నన్నిటిని పాడుచేసుకొని వంటలు చేసుకొని బ్రతుకుచు, అనేక దురభ్యాసములకు లోనయ్యెను. వంటలవలన గడవక దొంగతనములు, బాటసారులను కొల్లగొట్టుట మొదలుగాగల పాపకృత్యములు చేయుచుండెను. అన్నియు తెలిసియు అతని భార్య మహాఇల్లాలు కావున మిన్నకుండెను.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు ఆ మార్గమున పోవుచుండగా నాగేశ్వరశర్మ ఆ బ్రాహ్మణుని మర్రిచెట్టుకు కట్టి ధనమును అపహరించెను. అంతలో ఒక కిరాతకుడు వారి నిద్దరిని చంపి ధనముతో పోవుచుండగా ఒక పెద్దపులి అతనిపైబడెను. కిరాతుని దెబ్బకు పులియు, పులివలన కిరాతకుడు మరణించిరి వారు నలువురు పాపులగుటంజేసి నరక భాదలు పడుచుండిరి.

నాగేశ్వరశర్మ భార్య సదాచారముతో భర్తను, భగవానుని తలంచుచు కాలము గడుపుచుండెను. ఒకనాడు ఆ గ్రామమునకు సత్యభారతియను యోగి వచ్చెను. ఆమె అతనిని పూజించి మహాశయా! భర్తయు సంతానము లేని ఏ కాకిని నన్ననుగ్రహించి నాకు మోక్షమార్గము తెల్పుము అని ప్రార్థించెను.

ఆమె వినయమునకు సంతసించి, ఆ సత్య భారతీస్వామి, అమ్మా! ఈ దినము కార్తీక పూర్ణిమ. ఈ రాత్రి దేవళమున దీపముంచిన, సత్ఫలితములు కలుగును. కావున అట్లు చేయుము. అనగా ఆమె ఎంతగానో సంతోషించినది.

దేవాలయమునకు వెళ్ళి ఒకచోట కడిగి ముగ్గులు పెట్టి దీపారాధనచేసి, అనంతరము ప్రతియింటికి వెళ్ళి కార్తీకపురాణమును వినుటకుగాను రావలసినదని అందరనూ పిలిచినది. పూర్తిగా పురాణమును వినినది.

ఆ రోజునుండి విష్ణుభక్తిగలిగి, హరిపూజ చేయుచునే మరణించెను. పుణ్యాత్మురాలుగదా! ఆమెను విష్ణుదూతలు విమానమునెక్కించుకొని కొంతకాలము ఒక పాపాత్ముని భార్యగా ఉన్నందులకుగాను ఆ దోషనివృత్తికి నరకలోకమునకు గొనివచ్చిరి.

అచట బాధలుపడుచున్న భర్తను, మిగిలిన ముప్వురిని చూచి విష్ణుదూతలవలన యావద్వృత్తాంతమును విని, వారలనుగూడా తనతో గొనిపొండని ప్రార్థించగా విష్ణుదూతలు అమ్మా! వారు నలుగురు మహాపాపులు నీవు యొనర్చిన కార్తీకదీప ఫలితమును కొంతభాగమును వారికి సమర్పించిన వారును పాపరహితులై వైకుంఠమునకు రాగలరని చెప్పగా, ఆమె వారు నలుగురియందును దయతల్చి తన దీపారాధన ఫలమునందు కొంతభాగమును ధారవోసెను. వారు పాపరహితులై వచ్చి ఈమెకు నమస్కరించి, ఆ విమానమున కూర్చుండి వైకుంఠమున చేరిరి.

ఓ రాజా! దీపదాన ఫలము ఎంతగొప్పదో యెంచితివా! ఈ కథను విన్నవారికి సకల పాపములు హరించును. అని తెలియచేసెను.

## 12. సాలగ్రామ మహిమ

ఓ రాజా! కార్తీక సోమవార మహిమయు, ద్వాదశీ మహిమయు సాలగ్రామ మహిమయు చెప్పెదను. ఆలకించుము అని వశిష్టుడు ఇట్లు చెప్ప నారంభించెను.

ఓ రాజా! కార్తీకమాసమున సోమవారమున మిక్కిలి పవిత్రమయినది. ఆ దినమున స్నాన దానాదులు చేసినవారు మిక్కిలి పుణ్యాత్ములగుదురు. ఆ దినమున ఉపవసించి నక్షత్ర దర్శనముచేసి ఆహారమును తీసికొనినవారు విష్ణుసాయుజ్యమును పొందుదురు.

ఇదియుగాక కార్తీకమాసము శనిత్రయోదశినాడు, శనిత్రయోదశి వ్రతముచేసిన సకల పాపములు పోగొట్టుగొని గొప్ప ఫలితములు పొందగలరు.

కార్తీక పున్నమిరోజున ఉపవాసము చేసినవారు సకలసంపదలను పొందగలరు.

తరువాత పుణ్యదినములు కార్తీక శుద్ధ ద్వాదశి, ఏకాదశులు, ఏకాదశినాడు ఉపవసించి, సాయంకాలము హరిదర్శనము చేసికొని ఆ రాత్రి జాగరణచేసి మరుసటిదినము ద్వాదశినాడు శక్తికొలది బ్రాహ్మణులకు సంతర్పణ చేయవలయును. యిట్లు చేసినవారికి హరి సాన్నిధ్యము లభించును. ద్వాదశినాడు చేసిన గోదానము, వస్త్రదానములకు అమిత ప్రాముఖ్యత కలదు.

కార్తీక శుద్ధ పాడ్యమి పూర్ణిమలయందు కంచుపాత్రయందు దీపారాధన చేయుట శ్రేష్టమని చెప్పబడుచున్నది. అటులనే ద్వాదశినాడు యజ్ఞోపవీతములు దక్షిణగా ఈయవలయును ఇవి యన్నియు యిట్లుండగా ద్వాదశినాడు సాలగ్రామము దానమిచ్చిన మహా సత్ఫలములు కలుగును. అందులకుదాహరణగా ఈ కథను ఆలకింపుము.

పూర్వము గోదావరీతీరమున ఒక చిన్న గ్రామము కలదు. ఆ గ్రామమున ధనవంతుడును, పరమలోభియనగు ఒక వైశ్యుడు గలడు. తాను తినక, ఇతరులకు పెట్టక దానధర్మములు చేయక, వడ్డీవ్యాపారమున లక్షలు గడించుచు మిక్కిలి హీనముగా జీవించుచుండెను. ఒకసారి ఆ వైశ్యుడు ఒక బ్రాహ్మణునకు కొంతసొమ్ము అప్పుగా యిచ్చెను. కొంతకాలము గడిచిన తరువాత తన సొమ్మును అసలు ఫాయిదాలతో యివ్వవలయునని పట్టుబట్టెను. పాప మా బ్రాహ్మణుడు కొంత కాలము గడువుకోరి "ఓయీ ఋణబాధ భయంకరమైనది. ఈ జన్మలో కాకపోయినను యింకొక జన్మనందైన తీర్చవలయును" అని యింకేమో చెప్పుచుండగా ఆ వైశ్యుడు ధర్మపన్నములకు కోపించి ఆ బ్రాహ్మణుని చిన్నకత్తితో పొడిచి చంపివేసెను. తదుపరి రాజభటులు దండితురేమోనని భయపడి తన గృహమునకువచ్చి దాగుకొనెను. కాని మనోవ్యాధి అంకురించి చివరకు అతనిప్రాణము తీసినది.

ఆ వైశ్యుడు బ్రహ్మహత్యా పాతకమువలన నరకలోకమున అనేక రకములగు బాధల ననుభవించుచుండెను.

ఆ వైశ్యునకొక పుత్రుడు గలడు. అతడు సుబుద్ధియను పేరు గలవాడు. తండ్రివలెగాక, ధర్మాత్ముడై దానధర్మములు చేయుచు ప్రజోపయోగమగు కార్యములు చేయుచు కాలము గడుపుచుండెను. అతని అదృష్టవశమున భూలోకసంచారము చేయుచు నారద మహర్షి అతని యింటికివచ్చి అతడు చేయుచున్న దానధర్మములు మిక్కిలి సంతసించి, ఓయీ! నీ తండ్రి బహ్మాహత్యాపాపము వలన యమలోకమున నరకబాధలను అనుభవించుచున్నాడు. కావున కార్తీక ద్వాదశినాడు, బ్రాహ్మణోత్తమునకు సాలగ్రామ దానముచేసి బాధలు తప్పింపుము అని చెప్పి తనదారిన పోయెను.

ఆయన మాటలు విన్న సుబుద్ధి ధన, అన్న, వస్త్ర, కన్యాదానములు చేయుచున్నాను ఇన్నింటివలన కలుగని ఫలము ఈ రాళ్లు దానముచేయుట వలన కలుగునా? అని ఎంచి ఆ సాలగ్రామ దానముచేయక మిన్నకుండెను

కొంతకాలము గడచి, కాలము ఆసన్నమై యతడు మరణించెను. గురు తిరస్కారమునకు పవిత్రములగు సాలగ్రామములను హీనముగా ఎంచుటవలన, అనేక నీచజన్మములను పశు, పక్షి జన్మములను ఎత్తి చివరకు ఒక బ్రాహ్మణుని కుమార్తెగా జన్మించెను.

ఆ బ్రాహ్మణుడు సదాచార సంపన్నుడు. తన కుమార్తెకు యుక్తవయస్సురాగానే బుద్ధిమంతుడగు యొక బ్రాహ్మణున కిచ్చి వివాహము చేసెను. కాని కర్మవశమున అతడు కొద్ది కాలమునకు మరణించెను. బ్రాహ్మణపుత్రిక వితంతువయ్యెను. బ్రాహ్మణుడు తన యోగదృష్టిచే అసలు కారణము గ్రహించి ఆమెచే ఒక బ్రాహ్మణునకు సాలగ్రామ దానము చేయించెను.

ఆనాడు కార్తీక సోమవారము. ఆమె అదృష్టవశమున చనిపోయిన భర్త తిరిగి బ్రతికెను. తిరిగి వారు కొంతకాలము సుఖంబులజీవించి స్వర్గప్రాప్తినొందిరి. అనంతరము ఆ బ్రాహ్మణకుమార్తె ఒక బ్రాహ్మణకుమారునిగా జన్మించెను. పూర్వజన్మ సుకృతమువలన నారద మహర్షి తనకు చెప్పిన మాటలు గ్రహించి, బ్రాహ్మణులకు సాలగ్రామ దానముచేసి తండ్రి బాధలు పోగొట్టెను.

కావున ఓ రాజా! సర్వఫలముల నొసంగు సాలగ్రామదానంబులు చేసి నీవును స్వర్గప్రాప్తిని పొందుము. అని వశిష్టుడు జనకునకు ఉపదేశము చేసెను.

## 13. కార్తీకంలో కన్యాదాన ఫలము

మరియు వశిష్టుడు జనకునితో యిట్లనియె

ఓ రాజా! కార్తీకమాసమున చేయవలసిన ధర్మములు మరికొన్ని గలవు.

ధర్మము తెలిసియు మరియొకరికి చెప్పకుండుట మహాపాపము. కార్తీకమాసమున నదీస్నానము ముఖ్యమని చెప్పియుంటిని గదా! అంతకంటెనూ మరింత ముఖ్యమయినది, కన్యాదానము. కన్యాదాన ఫలము యింతింతని చెప్పనలవిగాదు. ఒక బ్రాహ్మణునకు ఉపనయనము చేయించుటయు, మంత్రదక్షిణ యొసంగుటయూగూడా సత్ఫలములనిచ్చును. ఏది చేసినను మొదట సద్బుద్ధి కావలయును. అదియన్నింటికంటెను ముఖ్యము. అయినను కార్తీకమాసమున ఉపనయనము చేయించరాదు. కాని వాగ్దానము చేసి మాసాంతమున చేయవచ్చును. అట్లు చేయించినవారు గొప్ప పుణ్యఫలము పొందుదురు. కనీసము అట్టి వివాహాది ఉపనయనాది కార్యములకు ద్రవ్య సహాయము చేసినను ఆ ఫలము కలుగును. కార్తీకమునచేయు కన్యాదానమునకు గొప్పఫలితము గలదు.

పూర్వము వంగదేశమును పాలించు సువీరునకు, మహాసౌందర్యవతియగు భార్యగలదు. సువీరుడు క్రూరుడు, కానీ అతని భార్య సుగుణవతి. ఒకానొక సమయమున సువీరుని రాజ్యమును శత్రువులు ఆక్రమించిరి. సువీరుడు భార్యతో అరణ్యములకు పారిపోయి నర్మదా నదీతీరమున ఒక చిన్న పర్ణశాల నిర్మించుకొని అరణ్యమునందు లభించు కాయగూరలు, కందమూలములు తిని కాలము వెళ్ళబుచ్చుచుండిరి.

కొంతకాలమునకు అతనిభార్య గర్భవతియై ఒక సౌందర్యరాశియగు కుమార్తెను గనెను. రాజదంపతులు ఆ బాలికను గారాబముతో పెంచుచుండిరి. మరికొంత కాలమునకు యింకొక కుమార్తె జన్మించెను. పెద్ద కుమార్తెకు యుక్తవయస్సు వచ్చినది. ఆమెను ఒక ముని కుమారుడు చూచి మోహించి, తనకిచ్చి వివాహము చేయవలసినదిగా సువీరుని గోరెను. సువీరుడు తన లేమిని చెప్పుకొని కొంత ధనమిచ్చిన కుమార్తె నిచ్చెదమని పలికెను.

అది విని మునికుమారుడు కుబేరునిగూర్చి తపమొనరించి మెప్పించి అతనివలన అక్షయపాత్రను పొందెను. దానిని సువీరునొసంగి, అతని కుమార్తెను పెండ్లియాడి సుఖంబుండెను.

సువీరుడు అక్షయపాత్రవలన కష్టములేకుండా కాలము గడుపుచూ రెండవబాలికనుగూడా ఎవరికేని యొసంగి కొంత ధనమును రాబట్టవలెనని యోచించుచుండగా అతని పుణ్యవశమున సాధువొకడు నర్మదా నదీతీరమున స్నానార్థము వచ్చెను. సువీరుని చూచి, ఓయీ! నీ వివరము లెయ్యవి? వినిపించుమని ప్రశ్నించగా సువీరుడు తన వృత్తాంతము నంతయును పూసగ్రుచ్చినట్లు చెప్పెను.

అది విని సాధువు సువీరునిచూచి ఓ రాజా! తెలిసియూ అజ్ఞానివై కన్యను అమ్ముకొని పాపమును మూటకట్టుకొంటివి. పితృదేవతలు హర్షించరు. యిందువలన కూతురు, అల్లుండ్ర గార్హస్థ్య ధర్మంబులు వ్యర్థములగును. కన్యా విక్రయమంత మహాపాపము వేరొకటి లేదు. దానికి ప్రాయశ్చిత్తమునూ లేదు. కావున నీ రెండవ పుత్రికను భూషితురాలిని గావించి, ఉత్తమున కిచ్చి శాస్త్రోక్తముగా కార్తీక మాసమందు వివాహము చేయుము. అట్లు చేసిన కన్యాదానమువలన నీ పాపములన్నియు నశించి సుఖంబు నుండెదవని చెప్పగా సువీరుడు అల్పబుద్ధి గలవాడై ఓ సన్యాసీ ! దానము ధనము కంటే ఎన్నటికినీ ఎక్కువకాదు. సుఖంబుకంటె యుత్తమమగు ధర్మములేదు అందుకు ధనముకావలయును. ఆ ధనమును ఏవిధముగానయినను సంపాదించుట మానవుని కర్తవ్యము. అన్ని సుఖములు ఆ సొమ్మువలన లభించును. “శరీరమాద్యంఖలు ధర్మసాధనం” శరీరమున్నగదా ధర్మములు. కావున ధనములేకుండా కన్యాదానమును ఎన్నటికినీ చేయను అని నిష్కర్షగా చెప్పెను. సన్యాసి సువీరుని అజ్ఞానమునకు విచారించి వెడలిపోయెను.

సువీరుడు చేసిన ఈ కన్యావిక్రయ మహాపాపము వలన అతని పూర్వీకులందరూ యమలోకమున జేరి నరకబాధల ననుభవించుచుండిరి. సువీరుని పూర్వీకుడైన శృతకీర్తియను పుణ్యాత్ముడుగూడా సువీరుని అజ్ఞానమునకు తన పుణ్యఫలమును పొగొట్టుకొని యమభటులచే యమలోకమునకు గొనిరాబడెను. ఏనాడునూ అన్యాయము అధర్మమును చేయని శృతికీర్తి తనను నరకమునకు గొనివచ్చిన

కారణమరయగోరి, యమధర్మరాజును సందర్శించి ఓ రాజా! ధర్మరాజునని పేరుగాంచితివి. ఇంతకన్న వేరొక అధర్మము గలదా? అని ప్రశ్నించగా యతనిని చూచి యముడు యిట్లనెను.

ఓ శృతకీర్తీ! నీవు న్యాయమూర్తివి. ధర్మమూర్తివి. నిజమేగాని నీ వంశములోనివాడగు సువీరుడు అజ్ఞానియై, దురాచారీయై కన్యావిక్రయ మహాపాపమును చేసెను. అందువలన అతని పూర్వీకులందరు నరకబాధలననుభవించి, తదనంతరము, హీన నీచ జన్మముల నెత్తవలసియున్నది అని చెప్పెను. అది విని, శృతకీర్తి ఇందులకు ఉపాయాంతరము లేదా? అని ప్రశ్నించెను. విని యమధర్మరాజు శృతకీర్తితో ఇట్లనియె :

ఓ మహారాజా! లేకేమి? నీవీ దేహముతో అతనివద్దకు వెళ్లుము. అతనికి మరియొక కుమార్తె గలదు. అలంకరించి ఆమెను కార్తీకమాసమున ఎవరికేని కన్యాదానము చేయించుము. యిందువలన మీకు నిష్కృతి గల్గును.

"కన్యాదానమునకు యింత ఫలితముగలదా?" యని శృతకీర్తి యడిగిన ప్రశ్నకు యముడు– ఓ మహారాజా! కన్యాదాన ఫలమును యింతయని చెప్ప వీలులేదు. గోవులకుగాని, బ్రాహ్మణులకు గాని వివాహము చేసినను ఈ ఫలము కలుగును, యిందువలన పితృదేవతలు సంతసింతురు. వారలకు పుణ్యగతులు కలుగును. కావున నీవు వెళ్ళి సువీరుని మనసుమార్చి నచ్చజెప్పి కన్యాదానమును చేయించుము. మీకందరికి ముక్తి కలుగును.

అని యమధర్మరాజు చెప్పినమాటలనువిని శృతకీర్తి మానవశరీరము దాల్చి, నర్మదానదీ తీరమున నివసించుచున్న సువీరుని ఎదుట నిలబడెను.

దివ్యరూపముతో తన ఎదుట నిలబడియున్న తన పూర్వీకుడగు శృతకీర్తిని చూచి, సువీరుడు వినయభావమున నమస్కరించెను.

తన ఎదుట వినయభావమున నిలచియున్న సువీరుని చూచి శృతకీర్తి ఇట్లనియె.

ఓయి సువీరా! నీవు మహారాజువైయుండియూ, రాజధర్మములను, కుల ధర్మములను, వంశాచారములనూ విడచి, స్వార్థపరుడవైతివి. రాజులు కోరు రాజ్యకాంక్ష

నశించినది. పొట్టపోసికొనుటకు పాడుపనులన్నియు చేయుటయేగాక మహా ఘోరమగు కన్యావిక్రయ మహాపాపమును చేసితివి. ఇందువలన నీవు క్షణికములగు సుఖములను అనుభవించుచూ మమ్ములనందరినీ నరకబాధలు పడునట్లు చేయుచున్నావు అని మందలించగా సువీరుడు తన తప్పిదమును గ్రహించి క్షమించమని వేడెను.

అంతట శృతకీర్తి ఓ సువీరా! యిది నీ తప్పుకాదు. కర్మవశము. కావున నీవు రెండవకుమార్తెకు తగిన వరునిచూచి కన్యాదానము చేయమని చెప్పి స్వయముగా మహాబల సంపదలుగల ఒక రాకుమారునికి నిశ్చయము చేసెను.

వారల సహాయముతో సువీరుడు వంగదేశముపై దండయాత్రచేసి శత్రురాజులను ఓడించి, నిశ్చయించిన ప్రకారము తన రెండవ కుమార్తెను ఆ రాజకుమారునకు కన్యాదానముచేసి, శుభముహూర్తమున వివాహము గావించెను. అంతియేగాక సువీరుడు ధనసహాయముచేసి కార్తీకమాసమున నూరు కన్యాదానములు చేసెను.

ఈ విధముగా సువీరుడును అతని పూర్వీకులునూ, కన్యాదాన ఫలమువలన మోక్షపదము పొందారు.

## 14. వృషోత్సర్జన ప్రభావము

అనంతరము వశిష్టుడు జనకునచూచి మరల యిట్లనియె

ఓ రాజా! కార్తీక పూర్ణిమనాడు చేయు, ఉసిరికాయలదానము సాలగ్రామ దానముల కెంత ప్రభావమున్నదో, ఆ దినమున చేయదగు వృషోత్సర్జనము వలన గూడా అంతే ప్రభావమున్నది :

కార్తీకపూర్ణిమనాడు ఆబోతును అచ్చుపోసి విడుచుటవలన పితృదేవతలు ముక్తిని పొందుదురు. అటులనే ఉసిరికాయలను దానము చేసి విశేషముగా దక్షిణలిచ్చి, శివకేశవుల సన్నిధిని దీపారాధనము చేసినవారు పాపంబులనుండి విముక్తిని పొంది మహాచక్రవర్తి పదముల నందగలరు. ఇక్కడే యింకొక విశేషముండియున్నది. ఏమనగా కార్తీకమాసమున, శివనాభమను పేరుగల సాలగ్రామమును దానము చేయవలయును. అందువలన గొప్ప ఫలములు సమకూరును. గాని అయ్యది అందరుకు లభ్యపడునది కాదు.

ఓ రాజా! ఇవి ఇట్లుండగా కార్తీకమాసమున విడువదగిన కర్మలు కొన్ని యున్నవి. అవి ప్రతివారునూ విడువవలయును. అని యిట్లు చెప్పనారంభించెను.

**కార్తీకమాసమున చేయకూడని పనులు :**

కార్తీకమాసము పవిత్రమయినది. ఈ మాసమున పరుల అన్నము తినరాదు. వేశ్యలు, శూద్రులు విక్రయించబడునటువంటి యన్నమును తినరాదు. ఉల్లిపాయలను విసర్జించవలయును. సంధ్యావందనాది నిత్యకర్మలు చేసి స్వగృహమందే శక్తిననుసరించి అతిథి అభ్యాగతులతో భుజించవలయును. పూర్ణిమనాడునూ, ఆదివారమునాడునూ, ఇంకనూ యితర సూర్య చంద్ర గ్రహణములు పట్టినరోజుననూ, ఏకదాశినాడునూ రాత్రులయందునూ భుజించరాదు.

ఈ మాసమున తలస్నానము (తైలస్నాము)పనికిరాదు. పగలు నిద్రించరాదు. కంచుపాత్రలను ఉపయోగించరాదు. వేద శాస్త్రములను నిందించరాదు. పురాణములను నిందించకూడదు ఇవయన్నియూ యిట్లుండగా ఈ మాసమున తప్పక నదీస్నానము చేయవలెను. ఈ స్నానము చేయునపుడు –

**"గంగేచ యమునే కృష్ణే, గోదావరీ సరస్వతీ, నర్మదే సింధు కావేరి, జలేస్మిన్ సన్నిధింకురు అస్యాం మహానద్యాం, సమస్త పాపక్షయార్థం, జ్ఞానాజ్ఞాన కృతదోష పరిహారార్థం"**

అను శ్లోకమును పఠించుచూ స్నానము చేయవలయును. ఈ విధముగా కార్తీకమాసమున వ్రతము చేయలేనివారు కనీసము పురాణశ్రవణమయిననూ చేయవలయును.

సాయంకాలమున శుచియై, సంధ్యా వందనాదికములు పూర్తి గావించుకొని, పూజామందిరమునగాని, దేవాలయమునగాని శివకేశవులను యధావిధిగా శాస్త్రోక్తముగా పూజించవలయును. అనంతరము షోడశోపచారపూజ చేయవలయును.

## శ్రీ పరమేశ్వర షోడశోపచార పూజావిధానము

ఓం శివాయనమః ధ్యానం సమర్పయామి

ఓం సర్వేశ్వరాయ నమః ఆ వాహనం సమర్పయామి

ఓం గౌరీనాధాయ నమః నవరత్నసింహాసనం సమర్పయామి

ఓం లోకేశ్వరాయ నమః అర్ఘ్యం సమర్పయామి

ఓం నందివాహనాయ నమః స్నానం సమర్పయామి

ఓం దిగంబరాయ నమః వస్త్రం సమర్పయామి

ఓం జగన్నాథాయ నమః యజ్ఞోపవీతం సమర్పయామి

ఓం కపాలధారిణే నమః గంధం సమర్పయామి

ఓం మహేశ్వరాయ నమః అక్షతాన్ సమర్పయామి

ఓం పరిపూర్ణ గుణాయ నమః పుష్పం సమర్పయామి

ఓం పార్వతీ వల్లభాయ నమః ధూపమాఘ్రాపయామి

ఓం తేజోరూప ఆర్తరక్షణాయ నమః దీపం దర్శయామి

ఓం త్రిలోచన లోకరక్షణాయ నమః నైవేద్యం సమర్పయామి

ఓం లోకసాక్షిణే నమః తాంబూలం సమర్పయామి

ఓం భవాయ నమః కర్పూర నీరాజనం సమర్పయామి

ఓం శంకరాయ నమః సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి

ఓం సజ్జన రంజనాయ నమః ప్రదక్షిణ నమస్కారం సమర్పయామి

ఈ విధంగా వారు వీరను భేదములేక అందరునూ పూజించవలయును. అట్లు నెలంతయు పూజచేసిన శివానుగ్రహము కలుగును. పూజానంతరము శివసన్నిధిన దీపమాలిక ఉంచుట మాత్రము మరువరాదు. అట్లు దీపమాలిక ఉంచిన పుణ్యప్రదము.

ఈ విధముగా శాస్త్రోక్తముగా పూజచేసిన అనంతరము బ్రాహ్మణులకు సమారాధన గావించి దక్షిణలిచ్చి సత్కరించ వలయును. నారదుడు మొదలుగాగల మహాఋషులు కార్తీకమాసమున ఈ విధంగా ఆచరించినవారు మహాపుణ్యవంతు లగుదురని చెప్పియుండిరి.

కార్తీక పురాణమునందు చెప్పినట్లు ఈ విధముగా చేసి రాత్రులందు నక్షత్ర దర్శనముచేసి భుజించవలయును. కార్తీక శుద్ధ చతుర్దశినాడు పితృదేవతలకు నమస్కరించి తిల సమర్పణచేసి బ్రాహ్మణులకు భోజనము పెట్టినయెడల పూర్వీకులు తరింతురు.

అట్లు జేయనివారు అనేక పాపములు చేసినవారగుదురు. అనేక నీచజన్మల నెత్తుదురు. కావున ఓ జనకమహారాజా! నీవును పవిత్రవంతమగు ఈ కార్తీక వ్రతమును చేసి, తరించి, పితృదేవతలను తరింపజేసి పరమపవిత్రుడవు కమ్మని ఉపదేశించెను.

## 15. కార్తీక దీపారాధన ఫలము

తదనంతరము వశిష్టుడు జనకమహారాజుతో...

ఓ జనక చక్రవర్తీ! కార్తీకమాస వ్రతమును గూర్చి ఆ ఫలమును గూర్చియు ఇంకనూ కొన్ని వివరములను చెప్పెదను విని ఆనందింపుము అని ఈ విధముగా చెప్పనారంభించెను.

ఈ మాసమందు భగవన్నామము చేయుట భగవంతుని కీర్తించుట, భగవత్సాన్నిధ్యమున దీపారాధన చేయుట, సాయంకాలమునందు దేవతాదర్శనము జేయుట కార్తీక శుద్ధ ద్వాదశినాడు హరిని ధ్యానించుట సకలోపచారములు చేసి ధూపదీప నైవేద్యాదులనిచ్చి పూజించినవారు పరమ పుణ్యపదము నలంకరించెదరనియు అట్లు చేయనివారు పరమపాపులగుదురనియు శాస్త్రము ఘోషించుచున్నవి. ఈ విధముగా దీపారాధన జేయుచూ, నెల దినములూ (కార్తీకమాసము) జేయవలయును. ఈ నెలదినములు చేయలేనివారునూ, చేయుటకు శక్తిలేనివారునూ కనీసము త్రయోదశి, చతుర్దశి, పూర్ణిమ దినములయందు దీపారాధనచేసి పుణ్యాత్ములవవలయునని శాస్త్రములు కొంత అవకాశమును యిచ్చినవి.

ఈ మాసమున శివాలయములలో దీపముంచిననూ, లేక యితరులుంచిన దీపమును వృద్ధిచేసినూ ఫలము లభించునని మహాత్ములు చెప్పియున్నారు. ఇందులకు ఉపమానముగా ఒక కథను చెప్పెదను. ఆలకింపుము.

పవిత్రమగు సరస్వతీనదీ తీరమున ఒక శివాలయము గలదు. ఆ దేవాలయము సంస్కారము లేక శిథిలమై యుండెను. ఒకానొక సమయమున యొక యోగి స్నానార్థము అటకు అరుదెంచెను. అతడు దయాళుడు, కర్మయోగి ఆ దేవాలయము శివాలయము. అందు కార్తీకమాసమంతయూ ధ్యాన జపములు చేయవలయునని తలంచి ఆ దేవాలయమును కడిగి శుభ్రముచేసి ముగ్గులు పెట్టెను.

సమీపగ్రామములకు వెళ్ళి ప్రమిదలను, నూనెయు, వత్తులను తెచ్చి పన్నెండు దీపములనుంచి అత్యంత భక్తిభావమున పూజాతపము చేయుచుండెను.

ఆ దేవాలయములోనే ఒకమూల ఒక ఎలుక కాపురముండెను. ఎక్కడెక్కడో తిరిగి అది ఆహారము సంపాదించుకొని పొట్టపోసుకొనుచుండెను.

ఒకరోజు ఆ ఎలుకకు ఏవిధమగు ఆహారమును లభించలేదు. వెలుగుచున్న ప్రమిదను చూచి ఆహారపదార్థమని భ్రమించి అటకుపోయి ఆ వత్తిని నోట కరచుకుని పోవుచుండగా యింకొక ప్రమిదకు తగిలి అందు ఆరిపోయినవత్తి మరల అంటుకొనినది. ఈ వేడికి తాళలేక ఆ ఎలుక ఆ వత్తిని అటనే వదిలిపోయినది.

అది కార్తీకమాసము. తెలియక ఆహారమని భ్రమించి, ఎలుక తీసుకొని పోవుచున్న మండుచున్న వత్తి వలన మరియొక దీపము వెలిగినది. అందువలన ఆ ఎలుకకు దీపారాధన ఫలము లభించెను, దానివలన ఆ ఎలుక చేసిన పాపములన్నియు పటాపంచలయ్యెను. ఆ దీపారాధన పుణ్యమువలన తిరిగి మానవరూపమును దాల్చెను.

అపుడే యోగి ధ్యానమునుండి లేచి ఎదురుగాయున్న వానిని చూచి, ఓయీ నీ వెవ్వరవు? యిటకు ఏల వచ్చితివని ప్రశ్నించగా అతడు నమస్కరించి యిట్లు చెప్పెను.

అయ్యా! నేను ఎలుకను. ఆహారమని భ్రమించి ఆ దీపపు వత్తిని గొనిపోవుచుండగా ఈ దీపము ఆ వత్తివలన వెలిగినది వెంటనే నా ఎలుక రూపము పోయినది. అని చెప్పి మరల యిట్లనెను.

“మీరు మహాత్ములు యిది అంతయు ఏమి? నాకు సవిస్తరముగా చెప్పవలయును” అని ప్రార్థించెను.

ఆ మాటలను విని యోగి ఎంతగానో ఆశ్చర్యమునందెను. అందులకు కారణము ఎన్నివిధముల ఆలోచించిననూ అతనికి దొరకలేదు. తపస్సువలన లభించిన దివ్యదృష్టివలన అతని వృత్తాంతమంతయు తెలిసికొనెను. అతడు మరింత ఆశ్యర్యమునంది ఆతనిని చూచి యిట్లనెను. ఓయీ! పూర్వజన్మయందు నీవొక బ్రాహ్మణకుమారుడవు. అయిననూ బ్రాహ్మణధర్మములను, కులాచారమును, వంశమర్యాదలను మంటగలిపి అనేక చెడుపనులను చేయుచు తుదకు జైనమతము

నవలంబించితివి. ధనార్జనయందు ఆసక్తిని పొందితిని. వ్యవసాయము మొదలుపెట్టి, నిత్యకర్మలు అనుష్ఠానము సంధ్యావందనాది కృత్యములను విసర్జించితివి. భార్యాపుత్రుల యందలి మోహముచేత, నీ స్వకృత్యములు అనేకుల వలన చేయించుకొనుచు వారిని సుఖపెట్టితివి. యితరుల కన్యలను దొంగలించియు స్వల్ప వెలలకు కొనియు, హెచ్చు వెలలకు అమ్మి, కన్యావిక్రయ మహాపాపమును పొందితివి. ఇన్ని విధములగు పాపములు చేయుటచేత అనేకములగు నరకబాధలు అనుభవించి చివరకు ఈవిధముగు నీచజన్మనెత్తితివి.

గతరాత్రి రెండుదీపములలో ఒకటి ఆరిపోయినది. వెలుగుచున్న ప్రమిదలోని వత్తిని ఆహారమని భ్రమించి అపహరించుకొని పోవుచుంటివి. ఆ వత్తితగిలి ఆరిపోయిన దీపము మరల వెలిగినది. అనుకోకుండగా దీపారాధన చేయుటవలనను, ఇది కార్తీకమాసమగుటవలనను, దీపారాధన ఫలము లభించి నీ పాపములు నశించినవి. నీ యధారూపము నీకు లభించినది.

ఇకనయిననూ ఉన్నదానితో తృప్తిపడి శక్తిననుసరించి దానధర్మములను చేయుచు, శివకేశవులను పూజించుచు ముక్తినొందుము. అని యోగి అతనికి ఉపదేశింపగా అతడును యోగికి నమస్కరించి, భగవన్నామము చేసికొనుచు తిరిగిపోయెను. అని మరల జనకమహారాజునితో వసిష్టమహాముని ఇట్లచెప్పసాగెను.

“ఓ జనకమహారాజా! కార్తీకమాసము శ్రీహరికి అత్యంత ప్రీతికరమయినది. అందువలన స్నాన, దాన, జన, వ్రతాదులు అత్యంత ముఖ్యములయినవి. యివి చేయనివారు పాపులనియు, వారు నరక బాధలు అనుభవించెదరనియు శాస్త్రములు ఘోషించుచున్నవి.

పైన చెప్పినవన్నియు చేసినవారు భగవంతుని యనుగ్రహమునకు పాత్రులగుదురు. తాంబూలము, పుష్పములు దానమొనర్చిన వారు గొప్ప సంపదలు పొందుదురు. నెలదినములు దీపారాధన చేసినవారు పాపములు పోగొట్టుకొందురు తులసిచెట్టు వద్దగాని దేవాలయము వద్దగాని దీపముంచినవారికి వైకుంఠ ప్రాప్తి లభించును.

పౌర్ణమి మరింత పవిత్రమయినది. సూర్యభగవానుని చూచిగాని, శివ కేశవాలయములలో గాని తాంబూలాదులతో కొబ్బరికాయలు దానముచేసినవారికి సంతానప్రాప్తి యగును. ఒకవేళ సంతానమున్న యెడల ఆ సంతానమునకు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధులు కలుగును.

ఈ మాసమున మరియొక విశేషము కలదు. అది ఆకాశదీపము. అనగా ఎత్తయిన స్థలమందుగాని, ధ్వజస్తంభములందుగాని ఆకాశ స్తంభము నొకదానినిపాతి అందు దీపముంచవలయును. అట్లు ఉంచిన దీపమును ఆకాశ దీపమందురు. అట్లు ఆకాశదీపమునుంచి దానికి భక్తిభావమున నమస్కరించినవారికి అన్ని పాపములు నశించును దీపమును పెట్టకపోయినను, లేక పెట్టలేకపోయినను దీపమునకు నమస్కరించవలయును. కాని హేళన చేసినవారు నీచజన్మనెత్త వలసియుండును.

ఈ చెప్పినమాటలు యదార్థములని గ్రహించుము. ఏలననయిందుల గురించి ఒక యితిహాసము గలదు. దానిని ఆలకింపుము. అని జనకమహారాజున కిట్లు చెప్పసాగెను.

పూర్వకాలమున అంగీరసుడు అను మహర్షిగలడు. అతడు ఉత్తమ మానవలక్షణములు గలవాడు. అతడొకానొక స్థలమున ఒక ఆశ్రమమును నిర్మించుకొని అందే విష్ణుమందిర మేర్పరుచుకొనెను. కార్తీక మాసమందు కార్తీకమాస మహాత్మ్యము తెలిసిన మహర్షులు కొందరు, ఆ మందిరమునకు హరిపూజ చేయుటకై వచ్చెడివారు.

ఒకనాడు ఆ మహాముని తక్కిన మహర్షులలో యిట్లనెను. ఓ మహాఋషులారా! కార్తీకమాసమున ఆకాశదీప ముంచినవారికి వైకుంఠప్రాప్తికలుగునని వినియుంటిని కావున మనము ఆ విధముగా ఆకాశదీప ముంచవలయునని కోరికగా యున్నది. మీరేమందురు? అనగా తక్కిన మునులందరు సరేనని బదులు పలికిరి.

వెంటనే వారందరును అరణ్య మధ్యమునకుబోయి ఒక వృక్షమును నరికి గొనివచ్చిరి. దానిని కొమ్ములు లేకుండా నరికి, స్తంభముగా చేసి విష్ణుమందిరమున కెదురుగా పాతిరి. అందుపై నవవిధములగు ధాన్యములపోసిరి. అటుపైన యొక పెద్ద ప్రమిదను అందుంచి ఆవునేతితో అఖండమును వెలిగించిరి. ఆనాడు కార్తీక పౌర్ణమి. ఆకాశదీపమును పౌర్ణమునాటి రేయి ఉంచవలయును. అది శివకేశవులకు ప్రియమైనది.

అనంతరము వారందరును ఒక చోటచేరిరి. అంగీరసమహర్షి సత్తముడు కార్తీకపురాణమును పఠించుచుండ, మిగిలిన మహర్షులు దానిని వినుచుండిరి. అంతలో గొప్ప శబ్దము విననయ్యెను. అదివిని వారందరు బయటకు వచ్చిరి. ఏమున్నది? అంతకుముందు ఆకాశదీపముంచిన స్తంభము ముక్కలైయున్నది. దీప మారిపోయెను. అది మహాపాపము. వారు విచారముతో ఇట్లగుటకు కారణమేమాయని ఆలోచించుచుండిరి.

ఇంతలో ఆ పగిలిన స్తంభమునుండి దివ్యమగు కాంతిగల ఒక మానవాకారము బయటికి వచ్చినది. అతనిని చూచి ఒక మహాముని యిట్లు ప్రశ్నించెను. ఓయీ నీ వెవ్వరవు? ఈ స్తంభమును ఎందులకిట్లు చేసితివి ? యిది మహాపాపముగాదా! అని అడిగిన దానికి ఆ మానవాకారము యిట్లు జవాబుచెప్పెను.

ఓ మహర్షిసత్తములారా! వందనములు! నా గాథ మీరు వినగలిగినచో అంతయు తేటతెల్లము కాగలదు. అని తనగాథ నిట్లు చెప్పసాగెను.

## 16. స్తంభమందు గల శాపగ్రస్తుని వృత్తాంతము

ఓ తపోధనులారా! పూర్వకాలమందు, అనగా క్రిందటి జన్మమునందు నేనొక బ్రాహ్మణునకు, మహాసంపదగలిగి యుండుట వలన గర్విష్ఠనైతిని, బ్రాహ్మణ్యములు వేదోక్తవిధులను, కులాచారములను వదిలివేసి భ్రష్టనైతిని.

దుష్టసహవాసము కలిగి నానాభ్రష్టత్వమును పొందితిని. వేద శాస్త్రములను చదువకపోగా, నిర్లక్ష్యముచేసి, వాటిని తగులబెట్టించితిని. బ్రాహ్మణ ధర్మమును వదలి, వడ్డీవ్యాపారము చేసి ధనార్జనచేయుట నారంభించితిని. దానధర్మములను పూర్తిగా విసర్జించితిని, తీర్థయాత్రలు చేయలేదు సరిగదా! గ్రామమున ఉన్న దేవళమునకే వెళ్ళి ఎరుగను. యిట్లు కొంతకాలము గడచినది.

పూర్వజన్మ సుకృతము వలన నాకు ఒక వేదసభ ఏర్పాటుచేయ సంకల్పము కలిగినది. బహుశా అదిఒకటియె నేను చేసిన మంచిపని.

ఎందరో పండితులు శ్రోత్రియులు బ్రాహ్మణులు సభకు విచ్చేసిరి. ధనమదంచే వారికి కనీసము నమస్కారము నయినను చేయకపోగా మరింత పొగరుతో వారిని హేళనచేసి, వేదములను దూషించితిని.

ఇన్ని మహాపాపములు చేసితిని. మరణించి యమలోకమున సకలవిధములగు నరకబాధలు అనుభవించితిని. అనేకములగు నీచజన్మముల నెత్తితిని. తుదకు ఈ వృక్షజన్మమెత్తితిని. పూర్వజన్మమునందు వేదసభను ఏర్పాటుచేయు సంకల్పమువలన కొంత పుణ్యమును సంపాదించి, ఆకాశదీపమును కొంతకాలము మోయు అదృష్టమును సంపాదించ గలిగితిని. ఇందువలన నాకు జన్మాంతరజ్ఞానముకలిగినది. మీకు నా పాపభూయిష్ట చరిత్ర వినిపించగలిగితిని.

ఆ మాటలువిని మహామునులు "ఆహా కార్తీకమాసము ఎంత ఫలప్రదమైనది. మానవులేగాక రాళ్ళు వృక్షములుగూడా ముక్తిని పొందుచున్నవిగదా! అని ఎంతగానో అచ్చెరువందిరి.

అంతలో మరల ఆ మానవాకారము, ఓ మహామునులారా! నాకుముక్తిగలదా! నాకీమానవాకారము శాశ్వతముగా ఉండవలయునన్న మీరు నాకొక చిన్న సహాయము చేయవలసి యున్నది అని చెప్పగా

"ఏమది?" అని మహర్షులు మానవాకారమును ప్రశ్నించిరి.

ఏమియునులేదు. నేను అడుగు విషమప్రశ్నలకు తగిన సమాధానము చెప్పిన నాకు పాపవిముక్తి కలుగును" అని మానవాకారము చెప్పెను. ఆ మాటలువిని మహర్షులు ఒకరిముఖములొకరు చూచుకొనసాగిరి. అంతలో అంగీరసమహర్షి ఆ ప్రశ్నలకు తాను జవాబులు చెప్పగలననియు, ఆతని పాపవిముక్తి కల్గించెదననియు చెప్పి తనకు సహాయకారిగా ఉండమని శ్రీహరిని ధ్యానించుకొనెను.

ఓ జనకమహారాజా! మానవాకార ప్రశ్నలను అంగీరసుని జవాబులను శ్రద్ధగావినుము.

## 17. అంగీరసుడు చేసిన జ్ఞానబోధ

అంగీరస మహాముని ఆ మానవాకారమును చూచి, ఓయి! నీవింక ప్రశ్నలడుగుము. సమాధాన మొసంగెదననగా-మానవాకారమిట్లు ప్రశ్నించ నారంభించెను.

<u>మానవాకారము</u> : ప్రపంచమునందు అందరుకును ఎట్లు కర్మబంధము కలుగుచున్నది?

**అంగీరసుడు** : ఓయీ! ఇది గొప్పప్రశ్న. కర్మఅనగా చేయుట. కర్మలవలననే ఆత్మకు దేహధారణము కలుగుచున్నది. కావున శరీర ఉత్పత్తికి కర్మ హేతువు అగుచున్నది. ఇందువలననే అందరకును ఏదోవిధమగు కర్మబంధము కలుగుచున్నది.

**మానవాకారము** : దేహము, యింద్రియముల సంబంధము ఆత్మకు ఎట్లు సంభవించుచున్నది ?

**అంగీరసుడు** : చెప్పితినికదా! పూర్వజన్మయందొనర్చిన పాపపుణ్యమువలన జన్మమును, కర్మవలన ఆత్మకు దేహధారణము కలుగుచున్నది. ఇంద్రియములు దేహమునకు ద్వారములవంటివి. అందుచే దేహము ఆత్మకు లభించుటయే తడవుగా పంచేంద్రియములును ఆత్మకు లభ్యమైనవి.

**మానవాకారము** : ముక్తిసాధన, జ్ఞానము దేహమునకు ఎట్లు లభించును?

**అంగీరసుడు** : శరీరోత్పత్తికి కర్మయే సకలవిధములా కారణభూతమగుచున్నది. అటులనే కర్మము చేయుటకు ఆత్మకు శరీరధారణ కారణమగుచున్నది. ఇది అవినాభావ సంబంధము. చరిత్రాత్మకమయినది. స్థూలసూక్ష్మ శరీర సంబంధమువలన ఆత్మకు కర్మబంధము కలుగునని ఆదిదంపతులగు పార్వతి పరమశివులు చెప్పియున్నారు. అందువలనను పంచభూతముల సమానముగ పంచేంద్రియముల వలనను, పూర్వజన్మ సుకృతమువలననూ, దేహమునకు ముక్తిసాధన జ్ఞానములభించుచున్నది.

**మానవాకారము** : అహం అనునది ఏమి?

**అంగీరసుడు** : అహం అనగా నేను అహం అను భావమువలననే మానవుడు పతితుడగుచున్నాడు. అన్నిటికిని తానే కారణభూతుడని ఎంచుట దీని లక్షణము. అంతియేగాక ఆత్మయే అన్నివిధముల శరీరమునకు అహంభావము, అహంకారము ఆరోపించి వ్యవహరించుచున్నది.

**మానవాకారము** : ఆత్మయు దేహము ఒకటిగాదా.

**అంగీరసుడు** : కావు. ఆత్మకు పూర్వజ్ఞానముండును. ఆత్మ సచ్చిదానంద స్వరూపము. నాది, నీది అని చెప్పబడు జీవాత్మయే అంతఃకరణకుసాక్షి. ఆత్మ శరీర ఇంద్రియములలో ఒకటిగాదు. దేహేంద్రియాదులు ఏదోయొక కాలమున నశించిపోవును. కాని ఆత్మ

నశించదు. ఆత్మ ప్రేమాస్పదమగు వస్తువు. ఆత్మవలననే అన్నియు సిద్ధించుచున్నవి. పరమాత్మ స్వరూపములు జ్ఞానమును గాంచునది ఆత్మయని ఎరుంగవలయును. ఆత్మకు పూర్ణత్వము, ఉపదేశత్వము జ్ఞానము సర్వజ్ఞత్వము గలవని వేదములయందు వ్రాయబడియున్నది. ఒక శరీరమున ఉన్నదియాత్మ, శేషప్రపంచమనందున్నది పరమాత్మ. అందుచేతనే శరీరము ప్రపంచమున ఒక భాగమైనది. జీవాత్మ పరమాత్మల కలయిక చరితార్థమయినది.

ఇందువలన సత్కర్మానుష్ఠానములు గలిగి వర్తించిన పవిత్రమగు ఆత్మజ్ఞానముగలిగి ముక్తిలభించును.

అని చెప్పగానే ఆ మానవాకారము యదార్ధమానవ రూపము దాల్చి అంగీరస మహాముని పాదములకు నమస్కరించెను.

## 18. మంచికర్మల గొప్పదనము

వశిష్ఠుడు జనకున కిట్లనియె :

అట్లు మానవాకారము యధార్థ మానవరూపమున దాల్చి అంగీరస మహామునిని చూచి యిట్లనెను.

ఓ అంగీరస మునీశ్వరా ! నీ దయవలన నేను ఈ విధముగా పాపరహితుడనై యధార్థరూపము పొందగలిగితిని. సకలపాపములను చేసినవాడను కనుక పాపమనిన నాకు బాగుగా తెలియును. అంతియేగాక అనేకవిధములగు బాధల ననుభవించుట వలన పాపమన్న భయముగూడా కలుగుచున్నది. ఈ విధముగా కార్తీకమాసమున మీ చలవవలన, ఆకాశదీప స్పర్శవలన నాకు సద్గతి కలిగినది. కావున ఓ మహానుభావా! నాయందు దయయుంచి వెంటనే శిష్యునిగా స్వీకరించండి. నాకు సత్కర్మలననేమో బోధపరిచి. ఆచరింపవలసిన విధానములను తెలిపి నన్ను మోక్షగామిగా చేయండి అని పలువిధములుగా ప్రార్థించెను.

ఆ మాటలకును, ఆ బ్రాహ్మణునకు కలిగిన పరివర్తనకును మిగుల సంతోషించి, అతనిని చూచి ఈ విధముగా చెప్పెను.

ఓయి బ్రాహ్మణుడా! నీవడిగిన ప్రశ్నలు మిగుల సమంజసములైయున్నవి. ఆత్మజ్ఞానము కొరవడిన మానవులు, ఈ శరీరము శాశ్వతమని నమ్ముటవలన

ఇటువంటి అనర్ధములు కలుగుచున్నవి. కావున యిటువంటి అనర్ధములు నశించుటకును ఆత్మజ్ఞానము కల్గుటకును సత్కర్మలు చేయుట అవసరము. సత్కర్మలయందు ఏవిధమగు సంశయములు ఉంచుకొనకండి ఆ కర్మలుచేసి పరమేశ్వరార్పణము చేయవలయును.

ఈ కర్మలుచేయు మానవుడెవరయినను కాలకృత్యములు తీర్చుకొని స్నానముజేసి సూర్యభగవానునికి నమస్కరించుకొనవలెను. కనీసము కార్తీకము, మాఘము, వైశాఖములయందైనను ప్రాతఃకాల స్నానము చేయవలయును. అదియునుగాక గ్రహణసమయములు, పండుగలు, యితర పుణ్యదినములయందుగూడా ఈ ప్రాతఃకాల స్నానము చేయవలసియున్నది. ఇందువలన ధర్మార్ధకామ మోక్షములు పొందగలుగుదురు.

అదేవిధముగా వేదమువంటి శాస్త్రము, కార్తీకము వంటి పుణ్యప్రదము, గంగా గోదావరుల వంటి పుణ్యనదులు ధర్మమువంటి స్నేహితుడు, బ్రాహ్మణులవంటి జాతి, ప్రపంచమున మరియొకటి లేవని తెలియవలయును. ఇవి శ్రీవిష్ణువుకు మహా ప్రీతికరములు. చాతుర్మాసము గూడా ఇట్టిదే అనగా ఆ బ్రాహ్మణుడు ఆంగీరస మహామునిని చూచి.

"ఓ మహర్షీ చాతుర్మాస మనగానేమి?" అని ప్రశ్నించెను.

ఆ ప్రశ్నకు ఆంగీరసుడు యిట్లు జవాబు చెప్పెను.

ఆషాడశుద్ధ ఏకాదశినాటినుండి కార్తీక శుద్ధ ఏకాదశివరకు చాతుర్మాస మందురు. ఈ నాలుగునెలలు సదాచారముతో చేయు వ్రతమును చాతుర్మాసమందురు.

"చాతుర్మాసము నెట్లు చేయవలయును? ఇంతకుముందెవరు చేసిరి? దాని ఫలమేమి?" అని ప్రశ్నించగా బ్రాహ్మణునిచూచి అంగీరసుడిట్లనియె.

"ఓయీ విప్రుడా! ఆషాడ ఏకాదశిని శయన ఏకాదశియందురు. అనగా శ్రీహరి ఆనాడు నిదురించి కార్తీక ఏకాదశినాడు నిదురలేచెను. కార్తీక ఏకాదశిని ఉద్దాన ఏకాదశి అంటారు. నాలుగు మాసములయందునూ, శ్రీహరి ప్రీతికొరకు స్నాన, దాన జపవ్రతాదులు చేయవలయును. అందువలన సత్కర్మలకు పూర్తి ఫలము లభించును.

పూర్వము, యుగములకు వెనుక, శ్రీహరి, లక్ష్మియు మరియితర పరిచారక బృందముతోడను వైకుంఠమునందు కొల్వుతీరియుండగా బ్రహ్మ మానసపుత్రుడును మహిర్షియు నగు నారదుడు అటకు వచ్చి శ్రీహరికి నమస్కరించెను. శ్రీహరి చిరునవ్వుతో నారదునిచూచి "ఓయీ నారదా! నీవు త్రిలోకములు సంచరించుచుందువు. ముల్లోకములయందునూ అందరూ క్షేమమేకదా! సత్కర్మలకు ఎటువంటి అఘాతము లేదుకదా? అని ప్రశ్నించెను. ఆ మాటలకు నారదమహర్షి యిట్లనియె.

"ఓ మహానుభావా! తమరు పూర్ణజ్ఞులు, త్రికాలజ్ఞులు, తమకు తెలియని విషయమేముండును? అయినను ఒక విషయము. అదియును తమరు అడిగినారు కనుక చెప్పుచున్నాను. కొందరు మానవులు అజ్ఞానులై తమకు విధించబడిన కర్మలను చేయుటలేదు. స్వధర్మములను వదలి యితరములగు ధర్మములను అవలంబించుటయు, ఇతర మతములు భుజించు పదార్థములను తినుటయు జరుపుచున్నారు. పరనింద, ఆత్మస్తుతి మానవులకు బాగుగా అలవడినది. అట్టివారి మహాపాపమునకు నిష్కృతిగలదా! దయచేసి వారిని పవిత్రులుగా చేసి రక్షింపుము" అని అనెను.

ఆ విధముగా చెప్పిన నారదుని మాటలను విని మహావిష్ణువు ముసలి బ్రాహ్మణరూపమున, భూలోకసంచారమునకు బయలుదేరెను. కొందరు పూజించుటయు, కొందరు దూషించుటయు, మరికొందరు హేళనచేయుటయు చూచెను. ఈ విధముగా పతితులైన మానవులనెట్లు పవిత్రులుగా చేయుటయా! అని ఆలోచించుచు, నైమిశారణ్యమునకు బయలుదేరెను.

తన నిజరూపముతో అచటి మునులకు దర్శనమిచ్చెను. శంఖచక్రగదాది పద్మకౌస్తుభాదులు ధరించి, మహామాతయగు లక్ష్మీదేవితో సాక్షాత్కరించిన శ్రీమహావిష్ణువును చూచి, నైమిశారణ్యమున గల మహర్షులందరు భక్తిభావమున పలువిధముల స్తోత్రములు చేసిరి.

## 19. చాతుర్మాస్య వ్రతవిశేషం

ఆ విధముగా ప్రత్యక్షమయిన శ్రీహరిని మహర్షులు అనేక విధములుగా ప్రస్తుతించిరి. అనంతరము ఆ ఋషులలో వృద్ధుడగు జ్ఞానసిద్ధుడను మహర్షి శ్రీమహావిష్ణువును అవలోకించి...

ఓ మహాదేవా! నీవు వేద్యుండవు. అద్వితీయుడవు. లోకమున నీకు తెలియని విషయములుండవు. దేవతలుసైతము నిరంతరము నీ సేవయందు నిమగ్నులైయున్నారు. మహర్షులు సైతము నీ పాదసన్నిధినిచేర కుతూహలపడుచుందురు.

నీవు సర్వాంతర్యామివి. నీవలననే సర్వేంద్రియములకూ జవసత్వములు కలుగుచున్నవి. అందువలననే ఎన్నియుగములు దొర్లిపోయినను నీవే పురాణపురుషుడవై యున్నావు నిన్ను ఎన్ని విధముల కొలిచినను సరిపోదు సరికదా, తనివితీరదు.

ఓ మహానుభావా! అనేకులకు బ్రోచితివి. ధృవుడు, ప్రహ్లాదుడు మొదలుగాగల అనేకమంది భక్తులను బ్రోచి భక్తిమందారుడవని పేరుగాంచితివి.

"కేశవా, నారాయణా, గోవిందా, హరేముకుందా, మురారే, రక్షించుము" అని పలువిధముల ప్రార్థించిన అనంతరము శ్రీహరి జ్ఞానసిద్ధునిచూచి ఓ జ్ఞానసిద్ధా! నీవు నిజముగా జ్ఞానసిద్ధుడవు. నీ స్తోత్రములకు మా మనస్సుప్పొంగి పోయినది. నీకు వలసిన వరంబు కోరుకొనుము అని చెప్పగా జ్ఞానసిద్ధి పరమాత్మునిచూచి యిట్లనియె

"ఓ మహనీయా! మునిజనమందారా! సర్వసంగ పరిత్యాగులము మాకు ఇంకేమి కావలయును, నీ పాదపద్మములందు మా మనసు నిశ్చలముగా యుండునట్లు నన్ననుగ్రహించుము" అని వినయముగా చెప్పిన జ్ఞానసిద్ధునిమాటలను విని శ్రీమహావిష్ణువు యీ విధముగా చెప్పసాగెను.

" ఓ మహామునులారా! ఈ లోకమందు అనేకులు దురాచారులై, స్వధర్మములను వదలి అవివేకులై తిరుగుచున్నారు. కావున వారలకును, మీకును, సర్వులకును ఉపయోగించు వ్రతమొకదానిని చెప్పెదను. మీరందరును సావధానులై విని, ఆ వ్రతమును ఆచరింపుడు. మీకు శుభము కలుగును.

"ఓ మహర్షులారా! నేను లక్ష్మీదేవితో గూడి ఆషాడశుద్ధ ఏకాదశినాడు క్షీరసాగరమున శయనించి మరల కార్తీక శుద్ధ ఏకాదశినాడు నిదురనుండి మేల్కొంచెదను. ఈ నాలుగుమాసములు పవిత్రములైనవి. వీటిని చాతుర్మాసములు అందురు. ఈ నాలుగు మాసములయందు చేసిన వ్రతములు నాకు మిక్కిలి ప్రీతికరములు. అట్లు వ్రతములు పూజలు చేసినవారు నిక్కముగా నన్ను చేరుదురు. వ్రతమాచరింపనివారు దుఃఖభాగులగుదురు.

కావున మీరందరునూ ఈ వ్రతమును ఆచరించి ఇతరులచే ఆచరింపచేయుడు. నన్ను స్తోత్రము చేసినవారికి నా సన్నిధి మరింత సులభము అని చెప్పి అంతర్హితుడయ్యెను.

ఓ జనకమహారాజా! అట్లు శ్రీ మహావిష్ణువు మహామునీశ్వరులందరుకును చాతుర్మాసవ్రతము చేయవలసినదిగా ఉపదేశించెను. అదియె నీకు నేను చెప్పితిని. ఈ వ్రతమునే అంగీరసమహర్షి బ్రాహ్మణ కుమారునకు చెప్పెను.

ఈ వ్రతమును అందరును జాతి, మత, కుల వివక్షతలు లేక ఆచరించవచ్చును. స్త్రీ పురుష భేదము అసలులేదు.

జ్ఞానసిద్ధి మొదలుగాగల మహామునులందరును ఈ వ్రతమును ఆచరించి కైవల్యపదము నందిరి.

కావున ఓ జనకా ! నీవును నీ చాతుర్మాన వ్రతమును ఆచరింపుము. అని వశిష్టమహాముని జనకమహారాజున కుపదేశించెను.

## ౨౦. పురంజయుడి వృత్తాంతము

ఇట్లు అనేకవిధములుగా చాతుర్మాసమునుగురించి చెప్పిన వశిష్టునిచూచి, జనకుడు యిట్లనెను.

“ఓ మహామునీ! కార్తీకమాస మహత్మ్యమును నాకు తెల్పితిరి. ఇంకనూ వినవలయునని ఉన్నది. కావున నాకు మరింత వివరముగా తెలుపవలయును. నన్నునుగ్రహించుడు. అని ప్రార్థించగా వశిష్టుడు ఎంతయో సంతసించినవాడై జనకమహారాజును చూచి యిట్లనియె.

“ఓ రాజా! పూర్వము అగస్త్యునకునూ, అత్రికిని కార్తీక మహత్మ్యమును గూర్చి కొంతచర్చ జరిగినది. అది నీకు వినిపించెదను వినుము” అని యిట్లు చెప్పనారంభించెను.

పూర్వకాలమున ఒకానొక శుభసమయంబున అగస్త్యుడు అత్రిమహర్షిని చూచి, “ఓ అత్రిమహర్షీ ! నీవు విష్ణ్వంశ సంభూతుడవు. కాన నీకు పూర్ణిమ కార్తీకమాసమును గూర్చి తెలియును. కావున దానిని నాకు వివరముగా తెలుపుము” అనగా అగస్త్యుని చూచి అత్రిమహాముని యిట్లనియె.

"ఓ అగస్త్యమహామునీ! తమకు తెలయనిదేమున్నది? ఆరోగ్యమే మహాభాగ్యము. శ్రీహరియే దేవదేవుడు అటులనే మాసములలో కార్తీకము పవిత్రమయినది. శ్రీహరికి అత్యంత ప్రియమైనది. కార్తీకమున చేసిన స్నానము, జపము, వ్రతము, దీపారాధనల వలన ఎనలేని శుభఫలములు కలుగుచున్నవి. శ్రీహరి భక్తికంటే వేరు వ్రతము లేదు. అదియే సర్వవిధములా సిరిసంపదలను ఆయురారోగ్యములనూ కైవల్యమును అందించును. ఈ మాదిరి శుభఫలితములు నిచ్చు కార్తీకము యొక్క మహాత్మ్యమును గూర్చిన చిన్న కథ ఒకటి గలదు. దానిని శ్రద్ధగా వినుము.

పూర్వం త్రేతాయుగమున పురంజయుడను రాజు అయోధ్యా నగరమును పాలించుచుండెను. అతడు సమస్త శాస్త్రములను అభ్యసించినవాడు. పట్టాభిషేకము జరిగిన నాటినుండీ, న్యాయబద్ధముగా రాజ్యపాలనము చేయుచుండెను.

అయిననూ కొంతకాలము గడచిన తరువాత అతనియందు యింకనూ రాజ్యము, సంపదలూ సంపాదించవలయునని కోరికయు, ఆశయూ కలిగినవి. జ్ఞానవివేకములు నశించినవి. చెడుబుద్ధకలిగినవాడై, ఇతరరాజుల రాజ్యములను మాయోపాయములచేత వశపర్చుకొనెను. దేవ బ్రాహ్మణ మాన్యంబులు లాగుకొనియెను. అధికమగు పన్నులు విధించి ప్రజలను మరింత మరింతగా బాధించెను. ప్రజలను రక్షింపవలసినదిపోయి దోపిడీలు, దొంగతనములు చేయించుచుండెను. ప్రజలకి భద్రత నశించినది.

ఆ సమయములో గల ఇరుగు పొరుగు రాజులందరునూ ఈ అరాచకమునకు, ఈ దేవబ్రాహ్మణ దూషణకు మిగుల విచారించిరి. తమలోతాము యోచించుకొని తమతమ బలగముతో అరుదెంచిరి. అట్లు ఆ రాజలందరునూ అయోధ్యానగరమును ముట్టడించిరి.

ఈ విషయము చారులవలన విని పురంజయుడు కొంచెమైననూ భయముచెందక, బాధపడక తన బలముల నన్నిటిని కేంద్రీకరించి చతురంగబలముతో బయలుదేరి రణభేరి మ్రోగించెను. సింహనాదముచేసి వారిని ఎదుర్కొనెను.

## 21. పురంజయుడు కార్తీకమాస వైశిష్ట్యమును తెలిసికొనుట

అనంతరము జరిగిన విషయమును అగస్త్యునకు అత్రిమహర్షి యిట్లనియె

అగస్త్యమహర్షి సత్తమా! ఉభయపక్షములకు పోరు ఘోరముగా జరిగినది. ఆశ్వికులు, రథికులు, అనేకులు ఆ రణమందు హతులైరి. రక్తపుటేరులు ప్రవహించ సాగినవి.

ఆ యుద్ధము మహాభయంకరముగా సాయంసమయమువరకూ సాగినది. ఆ యుద్ధమునందు పురంజయుడు పూర్తిగా ఓడిపోయెను. అతని సైనికులందరూ హతులయిరి. అతడింకేమియు చేయునది లేక రహస్యముగా యుద్ధరంగము నుండి తప్పించుకొనిపోయెను.

అట్లు పొందిన పరాజయమునకు మిక్కిలి దుఃఖించుచుండెను. అసలు యుద్ధమెందుకు చేసితినా యని విచారించుచుండెను. ఆ సమయంబున సూర్యవంశమునకు పురోహితుడగు సుశీలుడు అచటకువచ్చి శోకాకులుడైయున్న మహారాజునుచూచి యిట్లనియె

ఓ రాజా! దుఃఖించకుము. జయాపజయములు దైవాధీనములు. నీవు మరల శత్రురాజులను జయించవలయునను ఆలోచన కలదేని, నే చెప్పినట్లు నడచుకొనుము. నే చెప్పుమార్గము నీకు శ్రేయస్కరము. నేను నీవు ధర్మమార్గమును త్యజించినపుడే చెప్పితిని. కాని నీ పూర్వకర్మవలన నేను చెప్పిన మంచిమాటలను వినిపించుకొనలేని స్థితియందుంటివి. అయిననూ మించిపోయిన దేమియనులేదు. పశ్చాత్తప్తుడవై నే చెప్పినట్లు చేయుము.

ఈ జరుగుచున్నది కార్తీక మాసము. మాసము లన్నిటియందునూ ఇదియె పరమ పవిత్రమయినది. రేపు కార్తీక పూర్ణిమ చింతలన్నియు మాని, ఉదయముననే లేచి స్నానము చేయుము. సంధ్యావందనాది నిత్యకర్మానుష్టానములు యొనర్చుము. అనంతరము దేవాలయమునకు వెళ్ళి, శివకేశవుల సన్నిధిని పవిత్రమూర్తి మంత్రముతో దీపారాధనము చేయుము, దీపారాధనము చేసి నీకు తోచినరీతి నాట్యము జేయుచు భగవన్నామస్మరణ చేయుము. ఇట్లు చేయుటవలన నీకు శత్రురాజులను జయించు సాధనసంపత్తును సమకూరుటయేగాక సుపుత్రప్రాప్తి గూడా కలుగును.

ఓ రాజా! నీవు ధర్మమార్గమును వదలి అన్యాయార్జనచేసి, బ్రాహ్మణులను నిందించి పాపపంకిలుడవైతివి. అందుచేత నీకు దైవబలము వ్యతిరేకించినది. అపజయము కలిగినది. ధర్మజ్ఞుడవై యుండుము. కార్తీకమాసవ్రతము ఆచరించుము. నీకు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధులు కలుగును అని సుశీలుడు పురంజయునకు చెప్పెను.

అనంతరము అగస్త్యుని చూచి అత్రిమహాముని యిట్లు చెప్పనారంభించెను.

## 22. కార్తీకవ్రతము చేసిన పురంజయుడు

అత్రిమహాముని అగస్త్యమహాఋషికి చెప్పినట్లు జనకమహారాజుతో వశిష్టమహాముని యిట్లనియె.

అంత అత్రిమహర్షి అగస్త్యునితో యిట్లనియె....

ఓ అగస్త్యమహర్షీ! సుశీలుడు ఆ విధముగా చేసిన అనేక ఉపదేశములకు పురంజయ మహారాజు మనసు మారినది. వెంటనే దేవాలయమునకు వెళ్ళెను. శ్రీహరికి షోడశోపచారములు చేసెను. హరినామస్మరణము చేయుచు, సాష్టాంగదండ ప్రణామాదులను ఆచరించి, ఆ రాత్రియంతయూ జాగరణ చేసెను. అనంతరము మరురోజు ఉదయము గృహమునకు తిరిగివచ్చెను.

అతని అదృష్టవశమున అతడు ఇంటికి వచ్చిన కొలదిసేపటికే తులసి పేరులను కంఠమున అలంకరించుకొని బ్రహ్మతేజముతో ఒక బ్రాహ్మణుడరుదెంచెను. ఆ బ్రాహ్మణోత్తముడు పురంజయుని చూచి ఇట్లనెను.

"ఓ పురంజయ మహారాజా! యిది చాల శుభసమయము. వెంటనే సైన్యమును సమాయత్తము గావించుకొని యుద్ధభూమికి వెళ్ళుము. నీకు శుభము కలుగును" అని చెప్పి తులసిదళములతో చేయబడిన చక్రమును అతని హస్తములయందుంచి అదృశ్యుడయ్యెను. పురంజయుడు ఎంతగానో ఆశ్చర్యపడెను. ఆ వచ్చిన బ్రాహ్మణుడు నిక్కముగా శ్రీమహావిష్ణువేయని భావించెను. అతనికి రెట్టింపు స్థయిర్యముకలిగినది. లేచి మిగిలిన స్వల్పసైన్యముతో యుద్ధభూమికి వెళ్ళెను. మరల ఇరువురికి యుద్ధము సాగినది. నిముషములు గడుచుచున్న కొలదిని పోరు మరింతగా భయంకరము కాసాగినది. శ్రీహరి కృపాకటాక్షవీక్షణమువలన ఆనాడు యుద్ధరంగమందు

ఎచట చూచిననూ పురంజయుడే కానవచ్చెను. అతని సైనికులు రెట్టించిన ఉత్సాహముతో యుద్ధము చేయుచుండిరి.

జయలక్ష్మి పురంజయుని వరించినది. ఇరుగుపొరుగు రాజులందరునూ పురంజయుని ధాటికి ఆగలేక భయపడి పలాయనమంత్రమును పఠించిరి. ఈ విధముగా జయముకలుగుటకు కారణం కేవలం కార్తీకవ్రతఫలమే నని గ్రహించి పురంజయ మహారాజు తన రాజ్యమంతటా ప్రజలందరూ మిక్కిలి భక్తిభావంబుతో కార్తీకమాస వ్రతమును చేయవలనని దండోరా వేయించెను.

ఓ అగస్త్యమహర్షీ! విష్ణుశక్తికిమించిన శక్తి ఏమున్నది? భగవంతుడు సర్వాంతర్యామి. ఇందుగలడు అందులేడు అని చెప్పుటకు ఏమాత్రమూ వీలులేదు.

సూర్యునకుగల తేజము, కార్తీకమువంటి మాసము, గంగవంటి పుణ్యనది, విష్ణువువంటి దైవము మరి లేవు.

ఈ కార్తీకమాసవ్రతము అత్యంత భక్తిభావమున ఎవరు ఆచరింతురో, ఈ వ్రతఫలములను విని ఆనందింతురో అట్టివారికి సర్వవిధములగు శుభఫలములును కలుగును.

## 23. పురంజయుడు ముక్తిని పొందుట

అని ఈ విధముగా కార్తీకమాసవిధానమును మహిమను, పురంజయ వృత్తాంతమును చెప్పిన అనంతరంబు

అగస్త్యమహాముని "ఓ అత్రిమహర్షీ! పురంజయునికి సుశీలుడి ఉపదేశానుసారము చేసిన కార్తీకవ్రతమహిమవలన జయము చేకూరినదని చెప్పియుంటిరి. తదుపరి ఏమి జరిగెను? దయతో చెప్పండి" అని పలికెను.

అపుడు అత్రిమహాముని ఈ విధముగా చెప్పనారంభించెను.

ఓ అగస్త్యా! మునికులతిలకా! సావధానచిత్తుండవై ఆలకింపుము. అటుల పురంజయమహారాజు కార్తీకమాస వ్రతిఫలము వలన అసమానశేముషీ విక్రమముల సంపాదించి, శత్రువులను నిశ్శేషము గావించెను.

అనంతరము, పూర్వమువలెగాక మిక్కిలి ధర్మజ్ఞుడయ్యెను. న్యాయమార్గమున పరిపాలన చేయసాగెను. సత్యమును అహింసను ఆచరించెను. ప్రజల శిరములయందు భారముగా యుంచబడిన అధికపన్నులను తొలగించి న్యాయమగుపన్నులు విధించెను. బ్రాహ్మణులను పూజించుచూ, సకల జాతులకు నిరతాన్నదానము చేయుచు మిక్కిలి యశస్సు నార్జించెను.

కేవలము కార్తీకమాస వ్రతఫలము వలన అన్ని పాపములు పోగొట్టుకొనినవాడై పుణ్యాత్ముడయ్యెను. నిరంతరము హరినామస్మరణ చేయుచు హరిభక్తాగ్రేసరుడయ్యెను.

ఇట్లు కొంతకాలము గడిచినది. పురంజయుడు తానింక ఈ రాజ్యమును, సుఖమును వదలివేసి తపమాచరించవలయునని ఏదేని దివ్యక్షేత్రదర్శనము చేయవలెనని, లేక ఏమి చేయవలయునా? అని పరిపరి విధములుగా ఆలోచించుచుండగా ఒకనాడు ఒక అశరీరవాణి అతనినుద్దేశించి ఈ విధముగా చెప్పినది.

ఓ పురంజయ మహారాజా! కార్తీకవ్రత ప్రభావమువలన నీ పాపములన్నియు నశించినవి. అందుచేతనే సదుద్దేశములు నీమనమున అంకురించినవి. నీ ఆశయము మంచిది. తప్పక సఫలమగును.

ఓ రాజా! వినుము. దక్షిణ భారతదేశమున కావేరియను పవిత్రవంతమగు జీవనది గలదు. అట్టి కావేరీ నదీ తీరమునానుకొనియే శ్రీరంగము అను దివ్యక్షేత్రము ఒకటి గలదు. అది భూలోకవైకుంఠమని పేరుగాంచినది. అచట గల స్వామి శ్రీరంగనాథుడు. శ్రీరంగనాథుడు భక్తులపాలిటి కల్పవృక్షము. కావున నీవు వెంటనే శ్రీరంగక్షేత్రమునకు వెళ్ళి అచట స్వామిని పూజింపుము. నీకు శుభము కలుగునని చెప్పెను.

అశరీరవాణి మాటలువిని, పురంజయుడు ఆనంద మహాసముద్రమున తేలియాడెను. వెనువెంటనే మంత్రుల రావించి రాజ్యభారమును వారి భుజస్కందములపై నుంచెను. ఇంక తక్కిన విషయములన్నిటిని పరిష్కరించి ఒక శుభముహూర్తమున

శ్రీరంగక్షేత్రమునకు బయలుదేరెను. మార్గమునగల అనేక జీవనదులయందు స్నానము చేయుచు క్షేత్రములను దర్శించుచుండెను. మహానదియందు స్నానము చేసెను. కోణార్కలోని సూర్యభగవానునికి వందనసహస్రము లర్పించెను. పూరీజగన్నాధస్వామి ఆలయమును దర్శించి, ఆ స్వామిని వేనోళ్ళ భక్తిభావమున కీర్తించెను. సింహాచల క్షేత్రమును, శ్రీకూర్మ క్షేత్రమును దర్శించి, ముచికుందుడను మహర్షి ఆశ్రమమున కొన్నిదినములుండి ద్రాక్షారామక్షేత్రమును చేరెను. ద్రాక్షారామమున వేంచేసియున్న భీమేశ్వరస్వామిని దర్శించెను. పవిత్రవంతమగు గోదావరియందు స్నానమొనరించి తర్పణములు విడిచెను.

ఇట్లు దారిలోగల అన్ని పుణ్యక్షేత్రములను దర్శించుచు కొన్నిదినములకు శ్రీరంగమును చేరెను. నిత్యమూ కావేరీనదియందు స్నానంబాచరించి శ్రీరంగనాధస్వామి ఆలయమునకు వెళ్ళి, స్వామిని భక్తిభావమున కొలుచుచుండెను.

అతని భక్తికిని, మూర్తిమంత్వమునకును దేవతలు మెచ్చిరి. అందువలన అతని రాజ్యము(అయెధ్య) సస్యశ్యామలమయినది. పలువిధములగు పంటలతో విరాజిల్లినది. నిత్యకళ్యాణము పచ్చతోరణమనునట్లుగా యుండెను. ఆకాలమున ప్రపంచమునందు అయోధ్యా రాజ్యమునకు సాటియగునది మరియొకటి లేకుండెను.

ఇట్లు భక్తిభావమున శ్రీరంగనాధస్వామిని కొలుచుచు అచటనే కార్తీకమాస వ్రతమ్మునాచరించి, కొంత కాలమునకు అయోధ్యరాజ్యమునకు సుఖముగా తిరిగివచ్చెను. ప్రజలు ఆనందోత్సాహములతో అతనికి స్వాగత మొసంగిరి. పురంజయుడు మరికొంతకాలము రాజ్యపాలనముజేసి కుమారునకు పట్టాభిషేక మొనరించి వానప్రస్థాశ్రమమునకు పోయెను. ఎచటయున్నను కార్తీకవ్రతమును మానలేదు. అతడు చివరికి జరాభారమున మరణించి, హరి సాయుజ్యము నందెను.

అని మరల అగస్త్యుని చూచి అత్రిముని యిట్లు చెప్పసాగెను.

## 24. భక్త అంబరీష వృత్తాంతం

ఓ అగస్త్యమహర్షీ! ఏది ఏమయినను కార్తీకమాస వ్రత మహత్మ్యమును ఎంత చెప్పినను తరగదు సరిగదా. వినువారికి గాని, పఠించువారికిగాని తనివితీరదు. ఇంకను కార్తీకమాసమును గూర్చిన విషయమును చెప్పెదను ఆకర్ణింపుము.

అనేకములగు జీవనదులయందు స్నానము చేయుటవలనను, అనేక పుణ్యక్షేత్రములను దర్శించుటవలనను గలిగిన ఫలములన్నియు ఒక్క కార్తీకమాసమందు చేసిన ద్వాదశివ్రతమున కలుగును. నీకావ్రతమును గూర్చి తెల్పెదనుగాక!

ఈ వ్రతమును కార్తీకమాసమున వచ్చుశుద్ధ ద్వాదశినాడు చేయవలయును. ఏకాదశినాడు కటిక ఉపవాసముండవలయును. ద్వాదశినాడు ఏ యితర వ్రతములుగాని పూజలుగాని చేయనవసరములేదు. ద్వాదశి ఘడియలలో మాత్రము భుజించవలయును. ద్వాదశి మహత్మ్యమును తెలుపు ఒక మహనీయుని చరిత్రను చెప్పెదను. ఆలకింపుము. నీకు అన్నివిషయములు తేటతెల్లముకాగలవు. అని యిట్లు చెప్పసాగెను.

పూర్వకాలమున అంబరీషుడను మహారాజు గలడు. అతడు ప్రతి ద్వాదశినాడునూ, ద్వాదశివ్రతమును జేసెడివాడు. ఇటుల కొంతకాలము గడిచినది. ఒకనాడొక సమయమున ద్వాదశినాడు, ద్వాదశిఘడియలు చాలా స్వల్పముగాయున్నవి. అతడు త్వరగా వ్రతమును ముగించి, వెనువెంటనే బ్రాహ్మణ సమారాధన చేయవలయునని త్వరపడుచుండెను.

అదేసమయమున దుర్వాసుడు సహజంగా మిక్కుటమగు కోపముగలవాడు, వచ్చెను. అంబరీషుడు దుర్వాసునికి నమస్కరించి "ఓ మహానీయా! నేను ద్వాదశిపారాయణము చేయవలయును అని ప్రార్థించెను.

దుర్వాసమహర్షి అతని ప్రార్థనలకు సరేఅనెను. పారణము జేయుటకు అంగీకరించెను. సమీపమందుగల జీవనదియందు స్నానము చేయుటకు వెడలెను. ఎంతసేపటికిని మరలిరాలేదు. అంబరీషుడు మిగుల త్వరపడుచుండెను. అపుడాయన తనలో తానిట్లనుకొనెను.

"దుర్వాసుడింకనూ రాలేదు. ద్వాదశిఘడియలు దాటిపోవుచున్నవి. ఆతడు రాకుండా భోజనము చేయుటెట్లు? ఆయనకొరకు చూచిన వ్రతభంగమగును. రాకుండా భుజించిన ఆతడు కోపిష్టి, ద్వాదశి విడిచిన భగవానునికి కోపమువచ్చును. భుజించినా దుర్వాసుడు కోపించును. అయిననూ తప్పదు. శ్రీమహావిష్ణువునే శరణు కోరెదను"

అనుకొనుచూ ద్వాదశిఘడియలలో భుజించనిశ్చయించి కొందరు పండితులను రావించి దీనికిగల ధర్మసూక్ష్మమును వివరించుమని కోరెను.

అప్పుడా మహాపండితులందరూ ముక్తకంఠమున, అంబరీషునితో ద్వాదశిఘడియలలో పారాయణము చేయమనియూ బ్రాహ్మణ కోపమును శ్రీమహావిష్ణువు ఆపగలడనియు చెప్పిరి.

అనియు మరల ఈవిధముగా అనిరి. ఓ అంబరీషా! యిట్టి అనర్థము జరుగుటకు కారణము మా దృష్టికొకటి తోచుచున్నది. వినుము అని ఈ విధముగా చెప్పసాగిరి.

## 25. దుర్వాసుడు అంబరీషుని శపించుట

ఓ అంబరీషా, మహాభక్తాగ్రేసరా! నీవు పూర్వజన్మమున కొన్నిపాపములను చేసియుంటివి. అందువలన నీకిట్టి అనర్థము సంభవించినది. ఇందు మేము ఏదో సలహాచెప్పినను ధర్మమని నిర్ణయించుటకు శక్తి చాలకున్నది. కావున నీవే యోచించి మంచిదనుకొనినదానిని చేయుము. అని విద్వాంసులు చెప్పినదానిని విని అంబరీషుడు వారలను చూచి యిట్లనియె

ఓ మహాశయులారా! ఏమయినను ద్వాదశిని విడువజాలను. భోజనముమాట యటుంచి ముందు మంచితీర్థమును త్రాగెదను. అందున నాకు ద్వాదశిఫలము లభించును."

అని అంబరీషుడు మరేమియూ ఆ విషయమువిూద చర్చ చేయలేదు. భగవానుని ఎదుటనున్న తులసితీర్థమును, ఒకించుక శ్రీమన్నారాయణమూర్తిని తలంచుచు సేవించెను.

సరిగా అదేసమయమున దుర్వాసమహర్షి అరుదెంచెను. ఆ దృశ్యమును చూచి, సహించలేకపోయెను. రౌద్రాకారమును దాల్చెను. "ఓ అంబరీషా? నీవు ఈ ప్రకారముగా చేయుటవలన ధర్మచ్యుతుడవైతివి. నన్ను భోజనమునకు పిలిచి అతిథిమర్యాదలను పాటింపక, ముందు భుజించితివి. ఇది మహా అవమానము, మహాపాతకమును అయివున్నది.

శ్రీమన్నారాయణమూర్తి ఏరీతుల చూచినను బ్రాహ్మ అవవమానమును సహింపదు. యిట్లు అతిథిని, బ్రాహ్మణుని మహర్షిని అవమానించి మహావిష్ణువుకు అవమానించితివి.

నీవంటి వాడిక యుండడు. నీకు రాజ్యగర్వము, ధనగర్వము, భక్తుడను గర్వము అంకురించినవి. నీవంటి గర్వోన్మత్తుడు యిట్టి మహాపవిత్రవంశమున ఎటుల జన్మించెనో అర్ధముకాకున్నది. అని పలువిధముల దూషించిన దూర్వాసమహామునిని చూచి అంబరీషుడు గజగజ వణికిపోయెను. వినయభావంబునను భక్తిభావంబునను వంగినమస్కరించి, వినయముయుట్టిపడుచుండగా ఇట్లు వక్కాణించెను.

"ఓ మహామునితిలకా! అజ్ఞానంబున నేను మహాపాప మొనరించి యుండవచ్చును, సహజమగు బ్రాహ్మణ శాంతభావనమున నన్ను క్షమించుము."

ఈ మాటలు వినుసరికి దూర్వాసునకు కోపము మరింత ఎక్కువయ్యెను. అతని హృదయము అవమానమువలన భగ్గున మండిపోవుచుండెను. ఇక ఏవిధముగను తన క్రోధభావమును అణచిబెట్టుకొనలేక

"ఓ రాజా! ఇట్లు అవమానము చేసిన నీవు అనేక హీనజన్మలనెత్తుదువు" అని భయంకరమగు శాపమునిచ్చెను. ఆ శాపముతోగానీ అతని హృదయము శాంతిని పొందలేదు.

ఆ సమయము శ్రీహరి అంబరీషుని హృదయమున ప్రవేశించి, మహామునీ! నీ శాపము కడుంగడు సంతసంబున అనభవించెదనని చెప్పెను. అప్పటికిని దుర్వాసుడు శాంతించలేదు, మరల శపించుటకు ఉద్యుక్తుడయ్యెను.

ఇక జాగు కూడదనుకొనెను. మంచిమాటలవలన లాభములేదని ఎంచి శ్రీహరి తన చక్రాయుధమును దుర్వాసమహామునిపై ప్రయోగించెను. గొప్ప కాంతితో అగ్నిజ్వాలలు వెడలగ్రక్కుచూ తనవైపునకు వచ్చుచున్న చక్రాయుధమునుచూచి దుర్వాసుడు భయపడి పారిపోయెను. ముల్లోకముల తిరిగెను. కాని చక్రము వెంబడించుచునే యుండెను. మహామునులు, బ్రహ్మ, మహేశ్వరుడు యితరములగు దేవతలు దూర్వాసమహామునిని ఆ చక్రము బారినుండి తప్పించలేకపోయిరి.

## 26. శ్రీహరిని దుర్వాసుడు శరణువేడుట

అని మరల అగస్త్యునిచూచి అత్రిమహాముని మిగిలిన కథావృత్తాంతమును వివరించసాగెను.

ఆ మాదిరిగా దూర్వాసుడు చక్రముబారినుండి తప్పించుకొనుటకు ఎన్నియె విధముల ఎందరినో శరణువేడెను. కాని ప్రయోజనము లేకపోయెను. ఇక ఏమియు చేయునదిలేక ఎకాయెకిని వైకుంఠమునకు వెళ్లెను.

వైకుంఠమున పాలకడలిపై, శేషతల్పమున, శ్రీమహాలక్ష్మి పాదము లొత్తుచుండగా దరహాసములొలికించు శ్రీహరి పవళించియుండెను. భయముతో కంపించిపోవుచూ దూర్వాసమహాముని శ్రీహరి పాదపద్మములపై బడెను.

"ఓ పురాణపురుషా! రక్షింపుము, నీదగు చక్రాయుధము నన్ను భుజింప వచ్చుచున్నది. దాని బారినుండి నన్ను కాపాడుము" అని ప్రార్థించెను.

శ్రీమన్నారాయణమూర్తి అతని ప్రార్థనలను వినెను. అతని వంక చిరునవ్వుతో చూచి యిట్లనియె.

"ఓ దుర్వాసా! తపోధనులు నాకు ప్రేమపాత్రులు. కాని బ్రాహ్మణరూపంబున పుట్టియూ నీకు శాంతము లేదు. కోపమున రుద్రుడవై యుక్తాయుక్త జ్ఞానమును మరచిపోవుచుంటివి.

త్రికరణశుద్ధిగా బ్రాహ్మణులకు గాని, నా భక్తులకుగాని, అన్యాయ, అవమానము కలుగుచున్నచో నేను ఏ మాత్రమును సహించలేను. దేవబ్రాహ్మణ సాధుజన రక్షణమే నా ఆశయము. అందుననే అన్ని అవతారములనెత్తియుంటిని.

అంబరీషుడు మహాభక్తుడు. నాకు అత్యంత ప్రియమైన ద్వాదశి వ్రత మాచరించినవాడు. అట్టి భక్తుని నానా దుర్భాషలతో దూషించితివి. అతనిని నీ ఎడమకాలితో తన్నితివి.

అయిననూ ఆ విషయమున అన్నివిధముల నీదే దోషమయియున్నది. ద్వాదశిఘడియలు దాటుచున్ననూ నీవు రాకపోతివి. అతడేమిచేయును? ద్వాదశిపారాయణ ఫలమును పొందుటకు కేవలము జలపానము జేసెను, దానికే నీవు కోపించి శపించితివి.

కాని ఒకవిషయము గ్రహించుము. ఆ సమయమున అతడు భక్తి ఆవేశముతో నన్ను స్మరించుచుండెను. అతని హృదయము అందువలన నాకు స్థావరమైనది. నీ శాపములు నాకు తగిలినవి. అయినను నీవు శాంతింపక మరల శపించబూనితివి. అందువలన శాపములను అరికట్టుటకై నా చక్రమును వినియోగించితిని. అని శ్రీమహావిష్ణువు తన చక్రాయుధమును వినియెగించుటకు గల కారణము తెల్పి దూర్వాసుని వదనమువంక చూచుచు మిన్నకుండెను.

## 27. అంబరీషుని దుర్వాసుడు శరణువేడుట

ఆ విధముగా శ్రీమహావిష్ణువు పరమ శాంతస్వభావముతో దూర్వాసుని బుజ్జగించి మరల యిట్లనెను. ఓయీ దూర్వాసమునీ! నీవు బ్రాహ్మణుడవు. నీశాపము అమోఘము. నీవు పదిజన్మలనెత్తమని అంబరీషుని ఘోరముగా శపించితివి. అదియూ మంచికేజరిగినది. అందువలన దుష్టశిక్షణార్థము నేను పది అవతారములు నెత్తుదును. కారణమేమియడుగవచ్చును. నీవు శపించు సమయమున నేను అతని హృదయము నందుండియుంటిని. అందువలన ఆ శాపములు నాకు తగిలినవి. అందువలన నీ వచనానుసారముగా చేప, కూర్మము, వరాహము, సింహము, పొట్టివాడు, కౄరబ్రాహ్మణుడు, మూఢరాజు రాజ్యములేనిరాజు, పాషండుడిగాను, బ్రాహ్మణుడిగను జన్మలనెత్తమని శపించితివి. ఆమాదిరిగా నేను పదిజన్మలకుబదులు పదిఅవతారాముల నెత్తుదును. ఆ అవతారములు ఏవియో వినుము.

1. జన్మ చేప – మత్స్యావతారము
2. జన్మతాబేలు – కూర్మావతారము
3. జన్మవరాహము – వరాహావతారము
4. జన్మ సింహము – నరసింహావతారము
5. జన్మపొట్టివాడు – వామనావతారము
6. జన్మ క్రూర బ్రాహ్మణుడు – పరశురామావతారము
7. జన్మమూఢరాజు – రామావతారము
8. జన్మ రాజ్యములేనివాడు – కృష్ణావతారము

9. జన్మ పాషండుడు – బుద్ధావతారము

10. జన్మ నిష్కర్మబ్రాహ్మణుడు – కల్కిఅవతారము

ఈ విధముగా నీవు శపించినరీతి పది జన్మలు ఎత్తి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయుదును.

కావున ఓ దూర్వాసా! యిపుడు నేను చెప్పినట్లు చేయుము. చక్రాయుధము శాంతించును.

అంబరీషుడు పరమ భాగవతోత్తముడు. కేవలము వ్రతభంగమగుననియే జలపానమొనర్చెను. నీవు చేసినపనికి మిగుల వగచుచున్నాడు. ప్రాయోపవేశముచేసి ప్రాణములు విడువ సిద్ధముగా యున్నవాడు. అందువలననే చక్రము నిన్ను యింతగా బాధించినది.

అవియన్నియు మహర్షి తుల్యుడవు. మహాజ్ఞానియునగు నీకు తెలియని అంశములుగావు. ప్రజారక్షణము రాజధర్మముగాని ప్రజాపీడనముగాదు. అటులనే సర్వులనూ ధర్మమార్గావలంబులుగా చేసి ధర్మన్యాయములను పునరుద్ధరించుట బ్రాహ్మణధర్మము. ఒకరు పాపియైన మరియొక బ్రాహ్మణుడు వచ్చి అతనికి ప్రాయశ్చిత్త మొనరింపవలయును.

బ్రాహ్మణహింసయూ, బ్రాహ్మణావమానము, ఎంత పాతకములో అటులే భక్తులకు చేసిన అవమానము, భక్తహింసయూ అంత పాతకములగు విషయములు.

కావున ఓ మహర్షీ! నీవు సర్వసంగపరిత్యాగివి. తపోధనుడవు. బ్రాహ్మణోత్తముడవు. నీకింతకోపము తగదు. కోపమువలన యుక్తాయుక్త విచక్షణజ్ఞానము నశించును. నీవు వెంటనే కోపమును వదలి అంబరీషుని శరణువేడుము. అతడు ఉత్తముడు. అదియునుగాక అతడొక్కడే ఈ సకల చరాచర ప్రకృతియందు నిన్ను రక్షించగలడు.

అని చెప్పిన విష్ణువుమాటలను ఆలకించి, దూర్వాస మహాఋషి ఎంతో బాధచెంది తను చేసిన అవివేకమునకు సిగ్గుపడినవాడై మారుమాటాడనేరక విష్ణుభగవానుడు చెప్పినట్లు అంబరీషుని శరణువేడుటకై బయలుదేరును.

## 28. దూర్వాస మహర్షి రక్షింపబడుట

ఆ ప్రకారంబుగా, శ్రీమన్నారాయణమూర్తి వచించిన ప్రకారము దూర్వాస మహాముని బయలుదేరి అంబరీషుడి దగ్గరికి వచ్చెను. విష్ణుచక్రము అతనిని వెంబడించుచునే యుండెను.

అంబరీషుడు ఆ సమయమున మహాపండితులునూ, సదాచార సంపన్నులునూ యగు బ్రాహ్మణోత్తములతో పరివృతుడై యుండెను. అతని వదనము ముడుచుకొనియుండెను. ద్వాదశినాడు జరిగిన అఘాయిత్యమునకు అతడు మిక్కిలి బాధపడుచుండెను.

సరిగా ఆ సమయమున దూర్వాసుడు వగర్చుకొనుచూ వచ్చి ఓ అంబరీషా! శరణు శరణు. భాగవతోత్తముడవని తెలిసియూ అవివేకముగా వర్తించితిని, క్షమింపుము. "ఈ చక్రాయుధము నన్ను వెంబడించుచున్నది. దాని భయముతో ముల్లోకములు చుట్టివచ్చితిని. నీవే రక్షింపవలయును" అని దూర్వాసుడు అంబరీషుని వేడెను.

అంబరీషుడు దూర్వాసునిజూచి వినయభావమున లేచి నిలుచుండెను. అసీనునిజేసి, భయపడవలదని అతనికి అభయమొసంగెను. అనంతరము చక్రాయుధమునుగాంచి నమస్కరించి యిట్లనెను.

"ఓ సుదర్శనచక్రమా! నమస్కారము. దుష్టశిక్షణ యొనర్చునీవు ఇట్లు బ్రాహ్మణుని వెంబడించుట తగదు. దయయుంచి భయకంపితుడైన ఈ దూర్వాస మహామునిని క్షమించి రక్షింపుము.

నీవు సర్వశక్తిబలసమన్వితుడవు. ముల్లోకములలో ఏదియు నీకు సాటిరాదు. అట్టి నీకు మావంటివారిమీద ఎందుకింత ఆగ్రహము? శరణిచ్చిన నన్నునూ, శరణుపొందిన దూర్వాసునీ రక్షింపుము.

ఈ విధముగా అంబరీషులు పలురీతులు ప్రార్ధనలు సలుపగా చక్రాయుధము పురోగమనము నాపి అంబరీషునితో యిట్లనెను.

"ఓ అంబరీషా! నీవు పరమ ఉత్తముండవనియు, భక్తాగ్రేసరుడనియు తెలిసి దూర్వాసుడు ఈ విధముగా అవివేకమున మెలంగెను. అందువలననే అతనికి ఇన్ని సంకటములు కలిగినవి.

నాబారినుండి రక్షించుకొనుటకు ముల్లోకములకు తిరిగెను. శ్రీమన్నారాయణమూర్తి ఆయుధమగు నన్ను అడ్డగల శక్తిగలవారు ఈ ముల్లోకములందునూ, ఎవరునూ లేరని మరల యొకమారు ప్రపంచమునకు విదితమైనది.

అని చెప్పిన తదనంతరము ఆ సుదర్శనచక్రము దూర్వాస మహామునిని చూచి ఈ విధముగా పలికెను.

"ఓ దూర్వాసమునీ! నీవు పరిపూర్ణుడవు. మహాఋషివి. అన్ని ధర్మములను ధర్మసూత్రములను యెరిగినవాడవు. నీకు చెప్పుట అనిన సామాన్యమగు విషయము కానేదరు. అయినను నా మాటలను ఆలకింపుము. దుష్ట శిక్షణయు, భక్తరక్షణయు భగవంతుని నిత్యకార్యములు. ఆ విషయము నీకు తెలియనిదికాదు. అంతియగాక భగవంతుడు సత్యమునకు న్యాయమునకు నియమమునకు భంగముగలిగెనేని ఎంతమాత్రము సహించడు. మరియు ఆయన భక్తులపాలిటి కల్పవల్లి అగుటవలన భక్తుల బాధలన్నిటిని ఆయన అనుభవించును. అది తెలిసియు, తెలియని మూఢునివలె ప్రవర్తించితివి. అంబరీషుని ఘోరముగా శపించుటవలన ఆ శాపములు శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడగు శ్రీమన్నారాయణమూర్తి అనుభవింపవలసి వచ్చినది.

అయిననూ నీవు బ్రాహ్మణోత్తముడవు. కావుననే నీ నోటి నుండి వచ్చిన ఘోరశాపములు శ్రీమన్నారాయణమూర్తి అనుభవించ సిద్ధమై లోకోపయోగకరమగు పది అవతారముల ఎత్తి విశ్వకళ్యాణ మొసంగనున్నాడు.

ఓ దుర్వాస మహర్షీ ! యివీ నీకు తెలియని ధర్మములు గావు. అయిననూ నీవు ఎరుగవలసిన దుర్గతి పట్టినది.

దురాగ్రహము వలన నీవు యుక్తాయుక్త విచక్షణా జ్ఞానమును పోగొట్టుకుంటివి. మహాభక్తుని దూషించితివి. పవిత్రమగు ద్వాదశి పారణములను కాలతన్నితివి. అందుననే నీకిట్టి సంకటములు దాపురించినవి. కావున ఓ మహాఋషీ! గమనించితివా, భక్తుల కెట్టి సహాయము లభించినదో! విష్ణుమహిమ వారికి సౌలభ్యపడును. ముల్లోకములందునూ దానికి ఎదురులేదని ఎరుంగుము.

ఇక ముందయిననూ బ్రాహ్మణులను, భక్తులను దూషించకుము. వ్రతములను, నోములను, కాలదన్నకుము. విష్ణుప్రీతి, శివప్రీతి కరములగు కార్తీకమాసమున దీపారాధనమును, ద్వాదశిపారణమును మహాముక్తిప్రదములు. శక్తివంతములు అని ఎరిగి వాటియెడ భక్తి శ్రద్ధలు కలిగియుండుము.

మరియు ఓ దుర్వాసమహర్షీ! పురుషార్థములగు ధర్మము. అర్ధము, కామము. మోక్షముల నొసంగునట్టి పవిత్రవ్రతము. సంతోషప్రదమునగు విష్ణుభక్తిని ఎన్నడునూ విస్మరించకుము. అట్లు విస్మరించి భక్తులను హింసించినవారికి ఈరకమగు అన్ని విధములగు సంకటములు సంభవించును. కావున యిక ముందుముందయిననూ యిట్టిపనులు చేయక బుద్ధికలిగియుండుము. అని సుదర్శనచక్రము దూర్వాసుని మందలించి హితోపదేశముచేసి తదనంతరము అంబరీషుని వదనమునవలోకించి యిట్లనెను.

ఓ అంబరీషా, భక్తాగ్రేసరా! యిటుల జరుగునని ముందే శ్రీ మహావిష్ణువు ఎరుంగును. నిన్ను రక్షించుటకును ఈతనికి హితోపదేశము చేయుటకును నన్ను ఇచటకు పంపెను.

అని చక్రాయుధము పలికినమాటలకు అంబరీషుడు దూర్వాసమహాముని విపరీతమగు ఆశ్చర్యమున మునికి ఒకరిముఖము ఒకరు అవలోకించుకొనిరి.

తదనంతరము యిరువురునూ మహా భక్తిభావముననూ వినయభావముననూ చక్రాయుధమునకు సాగిలపడి, బహుముఖంబుల స్తుతించిరి.

వారి ప్రార్ధనలు విని, చక్రాయుధము అమందానందమును పొంది వారిని ఆశీర్వదించి, అదృశ్యమాయెను.

కావున ఓ జనకమహాచక్రవర్తీ ! నిరంతరం భగవన్నామస్మరణలో తేలియాడు నీవు అత్రిమహాముని అగస్త్యునకు చెప్పిన ఈ కథలో గల ద్వాదశిపారణ మహత్మ్యమెట్టిదో తెలిసికొంటివి.

కావున నీవును ఏకాదశినాడు ఉపవసించి ద్వాదశి ఘడియలలో బ్రాహ్మణోత్తముల రావించి పంచభక్ష్య పరమాన్నాదులతో వారిని సంతోషపెట్టుము. నీకు శుభములు కలుగును. అని వశిష్టుడు చెప్పి తిరిగి ఈ విధముగా పలికెను.

## 29. దూర్వాస మహర్షి పూజించబడుట

అత్రిమహాముని అగస్త్యున కిట్లనియె

ఆ విధముగా ఎంతోకాలము వెంటాడిన చక్రము అదృశ్యమయ్యెను. అనంతరము అంబరీషుడు దూర్వాసుని పాదములపై బడియుట్ల విన్నవించుకొనియెను.

"మహామునిశ్రేష్ఠా! తాము రుద్రాంశసంభూతులు. కేవలము నా అదృష్టవశమున ద్వాదశినాడు నా గృహమునకు అరుదెంచితిరి. కేవలము పురాకృతకర్మమువలన కొన్ని అనర్థములు సంప్రాపించినవి.

నేను సంసారసాగమునబడి, ముక్తికొరకు పరితపించు సామాన్య గృహస్తుడను. నాకు ధర్మములు తెలియవు. నేను మహాపాపిని, కావుననే యింతవరకూ నాకు మోక్షపదము లభించలేదు.

ఓ దూర్వాసమహాముని తిలకా! నన్ను క్షమించి, నా ఆతిధ్యము నంగీకరించి, ద్వాదశపారణములను భుజించి, నన్నాశీర్వదించి, నాకు ముక్తికలుగు మార్గములను ఉపదేశింపుడు" అని పలువిధముల ప్రార్థించెను. ఆ విధముగా అత్యంత భక్తిశ్రద్ధలతో తన పాదములను తాకి ప్రార్థించుచున్న అంబరీషచక్రవర్తిని గాంచి ఎంతో ఆనందమునంది దూర్వాసమహాముని ఈ క్రిందవిధముగా పలికెను.

"ఓయీ అంబరీషా! క్షత్రియకులముల పుట్టినవారిలో నీయట్టి వారు మరియొకరు ఎంత వెదికిననూ కానరారు. రాజులలో క్షుద్రమగు స్వభావములును, రాజోచితమగు శౌర్య ధైర్య సాహసములు తప్ప, ఈ విధమగు శాంతస్వభావము కానరాదు. కాని క్షత్రియుడవైనా, నీవు బ్రాహ్మణధర్మములందు అద్వితీయుడవు. రాజువైనా నీవు శాంతి, సత్యము, అహింసపధములలో పయనించుచుంటివి. యిందువలన నీవు ఉత్తముడవు. మహాపురుషుల కోవకుచెందిన వాడవు" అని పై విధముగా పలురీతుల అతని ఉదార స్వభావమును కొనియాడి తదనంతరము అతనిని చూచి దూర్వాస మహామునియిట్లనియె. ఓ అంబరీషా! ఇది వినుము. నీయట్టి సాధుభావము అందరికిని సులభముగా లభ్యపడునట్టిదిగాదు. ఇది కేవలము నీదగు పురాకృత జన్మ సుకృత ఫలమున లభించినది. నీవు ధన్యుడవు"

అంబరీషుడు మహాకోపిష్టియగు దుర్వాస మహాముని యిట్లు ప్రసన్న చిత్తమున మాటలాడుట చూచి, ఆనందప్రవాహముల తేలియాడెను.

అనంతరము అంబరీషుడు దూర్వాసమహాముని పాదములను శీతలోదకములు కడిగి ఆ పాదోదకమును, వినయవినమ్రత భావమున తలపై నిడుకొనెను. తరువాత దుర్వాస మహాముని అంబరీషుని పలువిధములగ శుభములు కలుగుగాక! అని యాశీర్వదించెను.

తదనంతరం దూర్వాసుడు ప్రసన్నచిత్తమున శాస్త్రోక్తములగు బ్రహ్మణవిధులతో, అంబరీషుడు తనకిడిన పంచభక్ష్యపరమాన్నాదులతో గూడిన ద్వాదశిపారాణములను కడుపార భుజించెను. అంబరీషుడు అతనికి కర్పూర తాంబూలాదుల నొసంగి సత్కరించెను.

బోజనానంతరము సంతుష్టహృదయముతో దూర్వాస మహాముని మరల అంబరీషచక్రవర్తిని గాంచి యిట్లనియె.

ఓయీ రాజోత్తమా! కడుంగడు వినయవంతుండవగుటం జేసి నీకు కొన్ని విషయములు జెప్పదలచినాను. శ్రద్ధగా ఆలకించి వాటిసారము నెరింగి మెలంగుము. నీకు శుభముకలుగును.

శాస్త్రముల సారము నెరిగియేయుంటివి. సర్వవిధములగు బాధలను పోగొట్టి ఆత్మకు శాంతిని ప్రసాదించినవాడునూ, పరమనిష్ఠా గరిష్ఠుడగువాడును, సర్వకాల సర్వావస్థలయందునూ భగవన్నామమును స్మరించుచూ, బ్రాహ్మణోక్తవిధులను సదా ఆచరించువాడును సర్వులకు పూజ్యుడను, ఇన్ని గుణములును నీయందు మూర్తీభవించినవి. కావుననే నీవు పూజ్యుడవయితివి.

అదియునుగాక నీవు, నన్ను కాపాడితివి. ముల్లోకములయందునూ, స్వర్గలోక, కైలాస, వైకుంఠములయందునూ, నాకు ఎచటనూ భద్రత లభించలేదు. కేవలము నీ ప్రార్ధనలచే సంతుష్టినంది ఎంతోకాలము నన్ను వెంబడించి, అనేక కష్టాల పాలొనరించి, మహాసంకటావస్థలో నన్ను ముంచిన చక్రాయుధము నాప్రాణములు తీయక, శాంతస్వభావమునంది మరలిపోయినది. నీవు నా ప్రాణము కాపాడితివి,

ప్రాణము నిచ్చినవాడును, ప్రాణమును కాపాడినవాడును, తండ్రియని ధర్మశాస్త్రములు ఘోషించుచున్నవి.

కాని ఓ అంబరీష మహారాజా! నీవా ధర్మసూక్ష్మమును ఎరుంగనైతివి. నాకు నమస్కరించితివి. చాలా బాధనందితిని. కాని ఏమి చేయగలను. వారించిన నీ స్వంత చిత్తమునకు క్షోభ కలుగునేయోయని శంకించితిని. నీయట్టి మహాపురుషునకు క్షోభకలిగించుట నా అభిమతము కాదు.

మరియు ఇంకొకవిషయము చెప్పెదను ఆలకింపుము. సకల వేదశాస్త్రంబులు చదువుటవలననూ, అనేకములగు వ్రతములు నోములు, ఆచరించుటవలననూ బ్రహ్మజ్ఞానము కలుగుననుమాట చాలా కష్టతరమని యెరుంగుము. కాని భూతదయ, వినయము కరుణార్ద్రహృదయము నిరంతరము ఉన్నదానితో తృప్తిపడుట, అతిథి, అభాగ్యతపూజ, పరిశుద్ధమగు ఆత్మ వీటివలన బ్రహ్మజ్ఞానముసులభము.

దూర్వాసమహాముని బ్రహ్మజ్ఞానిగాడు. అతనికి ఇంకనూ బ్రహ్మత్వము సిద్ధించలేదు. నీవు అత్యంతభక్తితో వ్రతం బాచరించియు కేవలము నేను ఆ పారణములను ఆరగించుటవలన ముదమందితిని. ఓ చక్రవర్తీ! నీవు సామాన్యుడవుగావు. నీ భక్తిని పరీక్షించుటకు శ్రీమన్నారాయణమూర్తి నన్ను యిట్లు చేయమని ఆదేశించినాడు. నీకంటే పరమభక్తాగ్రేసరుడు ఈ పదునాలుగు భువనములయందునూ లేడని ఈ విషయమున తేటతెల్లమయినది.

అని పలికి అంబరీషునికి ముక్తిమార్గములు ఉపదేశించి, అతని శలవుకొని దూర్వాసమహాముని మరల లోకసంచారమునకై వెడలిపోయెను. ఓ అగస్త్యమహామునీ! వింటివిగదా అంబరీషుని భక్తితత్వరీతి! అదియుగాక ఈ విషయమంతయు కార్తీక ద్వాదశినాడు జరిగినది. ద్వాదశి మహత్మ్యమెట్టిదియో అర్థమయినది గదా.

కావున ఆత్మజ్ఞానము కొరకునూ కైవల్యప్రాప్తి కొరకునూ ఈ విధముగా ద్వాదశివ్రతముచేయుట మానవుల కెంతయు శ్రేయస్కరమయిన విషయము. అదియునూగాక యిందువలన జన్మ రాహిత్యము కలుగును.

జనకునిగాంచి వశిష్టుడు యిట్లనియె

ఈ విధముగా అగస్త్యుడు కోరిన విధమున అత్రిముని అనేక విధములగు శుభఫలితముల నిచ్చు కార్తీకమాస మహాత్మ్యము గూర్చియు ద్వాదశపారాణ మహాత్మ్యమును గూర్చియు చెప్పెను.

నీవునూ ఆ విధము కార్తీకమాస వ్రతమును చేయుము. ఏకాదశినాడు ఉపవాసముండి ద్వాదశినాడు పారణముచేయుము. నీకు సకల శుభములుకలుగును. అని వశిష్టుడు జనకుడు కోరిన కార్తీకమాస మహాత్మ్యము వినిపించెను.

## సూతుడు శౌనకాది మహామునులకు చెప్పినవిధము

కార్తీకమాసము అన్ని మాసములయందునూ ఉత్తమమయినదనియు, పవిత్రమయినదనియు దానికిసాటియగు మాసము మరియొకటిలేదనియు తెలిసికొంటిరి.

కలియుగమునందు ధర్మము అడుగంటిపోవును. అధర్మము చెలరేగును. నీతి, న్యాయములకు ఎందునూ చోటుండదు. మానవుడు అధర్మవాదియై సంచరించును. ఇహమునకుపయుక్తమగు పనులగూర్చియే యెచింతురు. పై కారణములవలన మానవులు మందబుద్ధులగుచున్నారు.

సంసారం సాగరం దుఃఖం అను ఆర్యోక్తి ఎరింగియేయుందురు. సంసారమందు వ్యామోహముచే నాది, నాకు అను కోరికలతో మునిగిపోవుచున్నారు. అందున సంసారసాగమునుండి తరించుటకు కొన్ని సాధారణ ఉపదేశములు యొసగబడినవి. కాని మానవులందరునూ నియమబద్ధులు కాలేరు.

అదియునూ ఆలోచించి ఈ కార్తీకమాస వ్రతము ఏర్పాటు చేయబడినది.

కావున ఓ మహామునులారా! మీరు అందరునూ, సర్వసుఖః, ఫల, ముక్తిప్రదాయినియగు కార్తీకమాస వ్రతమును ఆచరించి అన్నివిధముల ఫలముల నొందుడు. మీకు మోక్షపదము సమకూరును.

అంతియుగాక జాతి మత కుల స్త్రీ పురుష బాల వృద్ధ భేదము లేక అందరునూ ఈ వ్రతము ఆచరించుచు భూలోకమునందు నివశించు ప్రజలందరునూ సామూహికముగా గాని వ్యక్తిగతముగా గాని ఈ వ్రతమును ఆచరించవచ్చును. శక్తికి మించిగాక తమ శక్తి ఉన్నంతవరకే చేయవచ్చును.

అట్లుగాక చేయలేనివారు లోకమున అనేకులు గలరు. వారల విషయమున వారుగూడా శక్తిని అనుసరించి చేయవచ్చును. అట్లునూ చేయలేకపోయిన కనీసము దేవాలయములయందు, స్నానాదులు గావించుకొని దీపారాధన చేసుకొనవలయును. అట్లు దీపముగూడా పెట్టలేనివారు కనీసము ఆ దీపమునుగాంచి నమస్కరించ వలయును. అట్లునూ చేయలేకపోయిననూ కనీసము కార్తీకమాస పుణ్యదినములలో కార్తీకపురాణమునయిననూ వినవలయును.

ఇది ముఖ్యముగా యెంచి కార్తీకమాసమున ఈ వ్రతమును ఆచరించి స్నాన, దాన, వ్రత దీపారాధనలు చేసి తరించుటకుగాను సర్వులకునూ ఉపయోగపడుటకు ఉద్దేశింపబడినది.

## ౩౦. కార్తీకపురాణ శ్రవణ ఫలము

సూతమహాముని శౌనకాది మహామునులనుగాంచి యిట్లనియె

"ఓ శౌనకాది మహామునులారా! ఈ కార్తీక మహాత్మ్యము చెప్పుటకు వేనోళ్ళు జాలవు" అని చెప్పెను.

శౌనకాది మహామునులు కార్తీకమాస మహాత్మ్యమును విష్ణుభక్తుల చరిత్రలను మిగులకొనియాడి, తమకు యిట్టి మహాపుణ్యప్రదమగు గాధను విన్పించిన మహాపౌరాణికుండగు సూత మహామునిని అవలోకించి ఈ విధంబున ప్రశ్నించిరి.

"ఓ సూతమునీంద్రా! మా మనస్సులయందు కొన్ని ప్రశ్నలు మిగిలియున్నవి. కలియుగముకదాయిది. జనులు సర్వవిధముల పాపాత్ములైయున్న వారలుగదా! వారు సంసారమహాసాగరము నుండి తరింపజాలకున్నారు కారణమేమి?" అని ప్రశ్నించగా సూతుడు వారలకిట్లు జవాబు చెప్పెను.

"ఓ శౌనకాది మహాములారా! మీరలడిగిన ప్రశ్నలు ఎంతో సమంజసములు. మీ ప్రశ్నలవలనూ జవాబులవలననూ ఆ విధముగా ప్రజానీకము వర్తించుటవలనను ముక్తి లభించును. బంధములు త్రెంచుకొని పోవును. క్రతువులొనర్చుట మొదలుగాగల పుణ్యకార్యములవలన అందరూ తరింపవచ్చును." అని చెప్పగా శౌనకాది మహామునులు మరల ప్రశ్నించిరి. సూతుడు ఆ ప్రశ్నలకు ఉచితరీతిన సమాధానము లొసంగెను.

మునులు : జనులు తరించుటకు ఉపాయమేది?

సూతుడు : పుణ్యకార్యములు చేయుటవలన

మునులు : అవి యేవి?

సూతుడు : క్రతువులు మొదలుగాగల వ్రతములు

మునులు : ధర్మమననేమి ?

సూతుడు : చతుర్విధ పురుషార్థములలో ఉత్తమమైనది ధర్మము.

లోకమున అనేకులు వ్రత, జప, క్రతువులొనరించి భూరిసంభావనలిచ్చి బ్రాహ్మణ సమారాధనలు చేసి, ముక్తినందుచూ లోకోపకారులగుచున్నారు. ఇట్టివి చేయుట అందరికి సాధ్యముగాదు. అందరికిని అందుబాటులో ఉండు కార్తీకవ్రత మొనరించిన చాలును.

కార్తీకమాసవ్రతమువలన క్రతువు లొనరించిన ఫలమును యజ్ఞయాగాది ఫలములనూ, సజ్జనస్నేహఫలమును, దానాది సత్కర్మలు యొనర్చిన ఫలమును కలుగును. ఈ కార్తీకమాస వ్రతము వలన జనులు సకల పాపములను పోగొట్టుకొనినవారై జన్మరాహిత్యమును పొందగలరు.

శివపూజయూ, విష్ణుపూజయూ, నామసంకీర్తనమూ, దీపారాధనయూ, దీపదానమునూ, ఆకాశదీప ముంచుటయూ, ఏకాదశినాడు ఉపవాసముండుటయూ, ద్వాదశినాడు పారణము చేయుటయూ కార్తీకమాస మంతయూ జీవనదులయందు స్నానమాచరించుటయూ, శక్తినసురించి దానములు మాసాంతమున తమకున్న దానిలో బ్రాహ్మణ సమారాధనయునూ అత్యంత ముఖ్యములయిన విషయములు.

శ్రీమన్నారాయణమూర్తికి అత్యంత ప్రియమగు కార్తీకమాసవ్రత మాచరించి, ఎందరో మహానుభావులు సర్వపాపములను పోగొట్టుకొనిరి. సకల సౌభాగ్య సంపదలనూ పొందిరి. వారు జన్మరాహిత్యమును పొందిరి. జీవించినంతకాలము అనేకములగు శుభఫలములను పొంది, మరణానంతరము శ్రీహరి పాద సాన్నిధ్యమును పొందిరి. మరియు మరియొక ముఖ్యవిషయము చెప్పెదను ఆలకింపుడు : అని సూతమహర్షి శౌనకాది మహామునులను చూచి యిట్లు చెప్పెను.

మాసములన్నింటియందు కార్తీకము మిగుల శ్రేష్ఠమయినది. ఆ మాసము మహాపుణ్యము. మరియు శివకేశవులకు ప్రీతికరము. అందుననే శాస్త్రములయందును అష్టాదశ పురాణముల యందును ఈ కార్తీకమాస ప్రశంస అధికముగా యున్నది.

ఈ మాసమునందు వ్రతములు, నోములు ఆచరించువారు సర్వపాపముల నుండియు విముక్తి నొందుదురని చెప్పబడుచున్నది. ఇందు మరల సూర్యుడు తులారాశియందు ప్రవేశించినప్పుడుచేయు స్నాన, దాన, వ్రత, దీపారాధనలు పవిత్రములనియు, అత్యంత శక్తివంతములనియు చెప్పబడుచున్నది.

అదియునుగాక కార్తీకమాసమున పౌర్ణమికి ముందువచ్చు ఏకాదశి ద్వాదశి తిధులు అత్యంత ముఖ్యమైనవి. ద్వాదశిపారణ మహత్మ్యమువలననే అంబరీషుడు దూర్వాసుని శాపముల బారినుండి రక్షింపబడెను. ఈ కథ మీరు ఎరిగియే యుంటిరి.

కార్తీక శుద్ధ ఏకాదశినాడు జీవనదియందుగాని, భావివద్ద గాని స్నానము చేయవలయును. దేవాలయమున దీపారాధన గావించుకొని బ్రాహ్మణోత్తమునకు దీపదానము చేయవలయును. ఆ దినమంతయు శుష్క ఉపవాసముండి ఆ రాత్రి భగవన్నామస్మరణ చేయుచూ జాగరణ చేయవలయును. కార్తీకపురాణ శ్రవణము గావించుకొనవలయును.

మరురోజు అనగా ద్వాదశి స్నానమాచరించి తనశక్తి ఉన్నంతలో, శ్రీమన్నారాయణమూర్తి ప్రీతికొరకు దాన ధర్మములు చేయవలయును. అనంతరము బ్రాహ్మణోత్తములతో ద్వాదశి పారణములను, ద్వాదశి ఘడియలు దాటకుండా ఆరగించవలయును.  పై చెప్పిన విధముగా భక్తిశ్రద్ధలతో ఆచరించినవారు భగవత్కృపకు పాత్రులగుదురు. వారలకు ముక్తి లభించును.

కావున ఓ మహామునులారా! అందరికినీ అందుబాటులోయున్న ఈ కార్తీక వ్రతము ఆచరించదగినది. ఈ కార్తీకవ్రత మహాత్మ్యమును వినువారికి పఠించువారికి సర్వశుభములు గలుగును.

**స్వస్తి**

**ఓం నమఃశ్శివాయ**

# పవిత్ర కార్తీకమాసంలో పాటించవలసిన నియమాలు

| దిన సంఖ్య | వాడకూడనిపదార్థాలు చేయకూడని పనులు | చేయవలసిన దానములు |
|---|---|---|
| 1. | ఉల్లి, ఉసిరి, చద్ది, ఎంగిలి చల్లని వస్తువులు | నెయ్యి, బంగారం |
| 2. | తరగబడిన వస్తువులు | కలువపూలు, నూనె ఉప్పు |
| 3. | ఉప్పు కలిసినవి, ఉసిరి | ఉప్పు |
| 4. | వంకాయ, ఉసిరి | నూనె, పెసరపప్పు |
| 5. | పులుపుతో కూడినవి | స్వయంపాకం, విసనకర్ర |
| 6. | ఇష్టమైనవి, ఉసిరి | చిమ్మిలి |
| 7. | పంటితో తినే వస్తువులు, ఉసిరి | పట్టుబట్టలు, గోధుమలు, బంగారం |
| 8. | ఉల్లి, ఉసిరి, మద్యం, మాంసం | తోచినవి – యథాశక్తి |
| 9. | నూనెతో కూడిన వస్తువులు, ఉసిరి | మీకు ఇష్టమైనవి, పితృతర్పణాలు |
| 10. | గుమ్మడికాయ, నూనె, ఉసిరి | గుమ్మడికాయ, స్వయంపాకం, నూనె |
| 11. | పులుపు, ఉసిరి | వీభూదిపండ్లు, దక్షిణ |
| 12. | ఉప్పు, పులుపు, కారం, ఉసిరి | పరిమళద్రవ్యాలు,స్వయంపాకం,రాగి, దక్షిణ |
| 13. | రాత్రిభోజనం, ఉసిరి | మల్లె, జాజి వగైరాపూవులు, వనభోజనం |
| 14. | ఇష్టమైన వస్తువులు, ఉసిరి | నువ్వులు, ఇనుము, దున్నపోతు లేదా గేదె |
| 15. | పగటి భోజనం, ఉసిరి | వరి అన్నపు భోజనం, వెండి |
| 16. | ఉల్లి, ఉసిరి, చద్ది, ఎంగిలి, చల్ల | నెయ్యి, సమిథలు, దక్షిణ, బంగారం |
| 17. | పై వస్తువులు మరియు తరిగిన వస్తువులు | ఔషధాలు, ధనం |
| 18. | ఉసిరి | పులిహోర, అట్లు, బెల్లం |

| దిన సంఖ్య | వాడకూడనిపదార్థాలు చేయకూడని పనులు | చేయవలసిన దానములు |
|---|---|---|
| 19. | నెయ్యి, నూనె, మద్యం, మాంసం, మైధునం, ఉసిరి | నువ్వులు, కుడుములు |
| 20. | పాలుతప్ప – తక్కినవి | గో, భూ, సువర్ణదానాలు |
| 21. | ఉల్లి,ఉసిరి, ఉప్పు, పులుపు, కారం | యథాశక్తి సమస్త దానాలూ |
| 22. | పంటికి పనిచెప్పే పదార్థాలు, ఉసిరి | బంగారం, గోధుమలు పట్టుబట్టలు |
| 23. | ఉసిరి, తులసి | మంగళద్రవ్యాలు |
| 24. | మద్యమాంస మైధునాలు, ఉసిరి | ఎర్రచీర, ఎర్రరవికె, ఎర్రగాజులు, పువ్వులు |
| 25. | పులుసు, చారు వంటి ద్రవపదార్థాలు | యథాశక్తి దానధర్మాలు |
| 26 | సమస్త పదార్థాలు | నిలువవుండే సరుకులు |
| 27. | ఉల్లి, ఉసిరి, వంకాయ | ఉసిరి,వెండి, బంగారం, ధనం, దీపాలు |
| 28. | ఉల్లి,ఉసిరి,సొర,గుమ్మడి,వంకాయ | నువ్వులు, ఉసిరి |
| 29. | పగటి ఆహారం, ఉసిరి | శివలింగం, వీభూదిపండు, దక్షిణ, బంగారం |
| 30. | పగటి ఆహారం, ఉసిరి | నువ్వులు, తర్పణాలు, ఉసిరి |



# ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రమ్

సౌరాష్ట్రే సోమనాథం చ శ్రీశైలే మల్లికార్జునమ్।
ఉజ్జయిన్యాం మహాకాలం ఓంకారే పరమేశ్వరమ్॥ 1

కేదారం హిమవత్పృష్టే డాకిన్యాం భీమశంకరమ్।
వారణాస్యాం చ విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే॥ 2

వైద్యనాథం చితాభూమౌ నాగేశం దారుకావనే।
సేతుబంధే చ రామేశం ఘుష్ణేశం చ శివాలయే॥ 3

ద్వాదశైతాని నామాని ప్రాతరుత్థాయ యః పఠేత్।
సర్వపాప వినిర్ముక్తః సర్వసిద్ధి ఫలం లభేత్॥ 4

యం యం కామమపేక్ష్యైవ పఠిష్యంతి నరోత్తమాః।
ప్రాప్స్యంతికామం కం కంహి పరత్రేహ మునీశ్వరాః॥ 5

యే నిష్కామతయా తాని పఠిష్యంతి శుభాశయాః।
తేషాం చ జననీగర్భే వాసో నైవ భవిష్యతి॥ 6

ఏతేషాం పూజనేనైవ వర్ణానాం దుఃఖనాశనం ।
ఇహలోకే పరత్రాపి సుఖం భవతి నిశ్చితమ్ ॥ 7

గ్రాహ్యా యేషాం చ నైవేద్యం భోజనీయం ప్రయత్నతః ।
తత్కర్తు సర్వపాపాని భస్మసాద్యాంతి వైక్షణాత్ ॥ 8

ఏకం చ పూజితం యేన షణ్మాసం తన్నిరంతరం ।
తస్యదుఃఖం న జాయతే మాతృకుక్షిసముద్భవమ్ ॥ 9

